# బడిపంతులు బ్రతుకు



రచన: [illegible]లా రంగస్వామి

# ముందుమాట

శ్రీలును శయించి చివికిన గుండెతో
పలు తెరంగుల బాధపడినయొజ్జ
విద్యమప్పగ తగు వేతనంబీవకే
ఒక్కచిక్కినయట్టి పంతులయ్య
కష్టాలుపడి విద్య గరుపగా గంజికే
అలమటించును యుపాధ్యాయుడేను
పసిపాపలకొరకు బాధపడ్డా గుడ్డ
అకటచాలదు గద ధ్యాపకునకు
న్యాయముగ నూటికొక ఉపాధ్యాయునకును
ఆస్తితలదాచ కొంపయు నసలు లేక
బాధజెందుచు నున్నట్టి వారిగోడు
వ్రాసితిని పడివంతులు బ్రతుకునంత.
పసిపాపయెదలోను భావాలు వెదజల్లి
కళలు దేశానికి గలుగజేసె
ఏబదియేండ్లుగా ప్రాభుత్వమున బని
చేయుగా మిగులకు చిల్లిగవ్వ
పూరిగుడ్సెయులేదు పూర్తిగానద్దిల్లు
కాలమునంతయు కాపురంబు
కొడుకులు కూతులు కోడండ్రు గల్గిన
కూక్కమంచముతక్క యొకటి లేదు,
జీవితంబంత కష్టాలచేత గడుపు
ఉన్నవుద్యోగులలో నొక్కయొజ్జయేను
గర్భదారిద్ర్య బాధచే కాలమెల్ల
గడుపుచున్నారు పంతుళ్లు పుడమినేడు.

ఇట్లు,
రచయిత.

శ్రీ

## బడిపంతులు బ్రతుకు నాటకము అభిప్రాయములు.

శ్రీ జాలా రంగస్వామిగారు రచించిన "బడిపంతులు బ్రతుకు" అను సాంఘిక నాటకములోని భాగములను కవి చదివి వినిపించగా వినడమే కాక కావ్యాన్ని తేలికగా దరహాన్ని పరిశీలించాను.

పటుత్వంగల ధారాళమయిన వాడుకభాషలో వ్రాయబడిన నాటకము సరళగతినొంది సామాన్య ప్రజలకు నాటిగా హృదయ రంజకమవుతుంది. పద్యభాగము లలితంగా పొదగబడి భావపుష్టి కలిగి వున్నాయి.

సహజంగా ఉపాధ్యాయుడైన కవి తన సామాన్య జీవితఅనుభవాన్ని వాగానుభూతిని పురస్కరించుకొని ఉపాధ్యాయుని బ్రతుకును అతి వాస్తవికమయిన మనుపరాని ప్రస్ఫుటదృశ్యంగా ప్రదర్శింపడంచేత కథ తీవ్రగతిని చనువుగా, హృద్యంగా నడుస్తుంది.

ఈనాటి సాంఘిక పరిస్థితుల్లో అనేక విధాలయిన సంస్కరణలు కావలసిన సందర్భంలో ఇటువంటి సాంఘిక నాటకానికి విలువైన స్థానం కలదు.

చక్కని నాటకం రచించిన కవి రంగస్వామిగారిని అభినందిస్తున్నాను.

దామెర్ల వెంకటారావు, (M. L. C.)
(రిటైర్డు ఛీఫ్ లెక్చరర్, ఆర్ట్సుకాలేజి,), 30-6-63. రాజమండ్రి

(2) శ్రీరంగస్వామిగారు రచించిన "బడిపంతులు బ్రతుకు" అక్కడక్కడ చదువబడగా వినగలిగితిని. చాలా బాగుగానున్నది. కవి హృదయపూర్వకముగా తన అనుభవమును తీవ్రమగు ఆవేశముతో వ్రాయుటచే అనుచితమనదగునది . ఒక్కటియు గానరాదు.

గద్యపద్యములు మొత్తమున వ్యవహారిక శైలియందు రచింపబడుటచే పండితులకును సామాన్యులకును చక్కగా బోధపడగలదు. సంభాషణ తీవ్రగతి నడచినది. పద్యములోని భావము ఆలుచిప్పలోని ఆణిముత్యమట్లు అణగియు ప్రకాశించుచున్నది. ఇది పాఠశాలలో వా

ధ్యాయులు చదివి బాలబాలికలచే ప్రదర్శింపజేయుటకు అనువుగా నున్నది.

పరమేశ్వరుడు శ్రీరంగస్వామిగారికి ఇంతకంటె ఎక్కువ శక్తిసామర్థ్యములనిచ్చి ఎల్లప్పుడు రక్షించుగాత.

ఇట్లు,
డి. రామయ్య, రిటైర్డు డివిజనల్ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు
రాజమండ్రి, 18-6-1953.

(3) మిత్రుడు శ్రీ జాలారంగస్వామిగారు రచించిన "బడిపంతులు బ్రతుకు" అనే నాటకంలో కొన్ని భావాలు కవిగారు చదువగా వింటిని సామాజిక జీవితాన్ని సృష్టించి స్పష్టవంగా నడువగలిగే ధీమంతులను ప్రజానాయకులను తయారుచేసే బడిపంతులు నేడు మనసంఘంలో పొందవలసిన గౌరవాన్ని పొందడంలో సందేహంలేదు. మీదిమిక్కిలి ఉపాధ్యాయవృత్తికి క్లిష్టస్థితి సంభవించింది. తాను స్వయంగా అనుభవించిన కష్టాలనేగాక తానుచూచి గ్రహించిన పరిస్థితులన్నింటినీ శ్రీ రంగస్వామిగారు కండ్లకు కట్టినట్లు చిత్రించినారు. వీరినాటకం పాఠకవు జనంలో నూతనభావాలను రేకెత్తించగలదని సమాజంలో అభివృద్ధిదాయకములైన మార్పులను తీసుకురాగలదని భావిస్తున్నాను.

దళితజనోద్ధరణకు తనజీవితాన్ని కైంకర్యముచేసిన శ్రీ రంగస్వామిగారింకా ఇతోధిక సేవలను తమ రచనలద్వారా చేయగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు,
బి. యస్. మూర్తి, పార్లమెంటరీ మెంబరు ఢిల్లీ.
ది 27 - 6 - 53.

---

# ధర్మదాతలగు శ్రీ యడవల్లి దొరయ్యగారికి సమర్పించిన
# నవరత్నములు

దాలిచితీవు కంకణము దానమునందున దానకర్ణవై
పాలిక పేదకార్మికుల బాధలుబాపగ నీవుకాదె నీ
శీలము నిష్కళంకమగు చిత్తము వుత్తమమైన జీవితమ్
బాలనచేతు పేదలను ఆర్యగుణాఢ్యుడ దొర్యయాఖ్యుడా.

పెద్దలలోన బుద్ధిగను పెద్దగపేరు గడించినావు ఏ
ప్రొద్దును దేశసేవకై పొంకముగా శ్రమజెందినావు నీ
శుద్ధమమైన మానసము జూడగనే యడవల్లివంశమున్
ఉద్ధరణంబుజేసితివి యూహలమోఘము దొర్యయాఖ్యుడా.

ఎందరులేరు వందలుగ యీవును పుట్టిన పల్లెటూరునన్
అందరిలోన నిన్నగద అగ్రసనాధిపగెన్నినారు ఏ
మందుర నీదు మానసమునందున యుండిన ప్రేమజోతియే
పొందగజేసె గౌరవము బుద్ధిబలంబది దొర్యయాఖ్యుడా.

ఆదరణంబుజేతువని యార్తులనాదుల దేశభక్తులన్
బాధలడించ సాయపడి పాటువడంగను ధైర్యవంతుడౌ
సాధువు సత్యసంధుడవు శాంతము యోరిమి యోపికున్నదే
కాదనలేవు కంకణముకట్టగ నిల్చెదు దొర్యయాఖ్యుడా.

చేతికి నెమ్ముకలేనిదయ శీలుడవంచును పేరుగాంచితో
నీతికి నిల్చుశూరుడవు నేర్పరి సద్గుణరాశివీవు నీ
మాతపితాది నోముయది మంచిగడించగ శక్తిగల్గనే
దాతవు నేలవీవనగ ధర్మమనంగను దొర్యయాఖ్యుడా.

చాలగ సంస్థలెన్నిటికో సాయముచేసిన ధార్మికుండవే
జాలియుగల్గుగుండెయుని సంఘమునందున పేరుగాంచితో



యడవల్లి వెరయ్యగారు, మార్కొండపాడు.

ఈ పుస్తకమును అచ్చొత్తించుటకు ధన సహాయము చేసిన దాతలు!

పోలరు యేరునీకు యిలపుణ్యములో కడు నగ్రగణ్యుడో
మేలగు నీదుకీర్తికిని మేలిమి మెర్గది దొర్యయాఖ్యుడా.
పేదల కాపదల్ గలుగ పెన్నిధివై కడునాదరింతువే
బాధల జూడలేక పరమార్ధము కై తమ ప్రాణమిత్తువే
భేదమెరుంగవే మొగడ పిల్వగపల్కుదు పిదప వెంతచిత్రమో
ఆదరణంబులేని కడుయార్తులగాతువు దొర్యయాఖ్యుడా.
ఘనతనుబొందినావుగద కార్మికసేవను జేసినావు నీ
వనుదినమేని సత్యముగ నక్కటమెల్గితి గాంధి జాడలన్
చనగలజెట్టివీవు యిక సందియమేమియులేదు దానిలో
మనసును దిట్టపర్చగల మాన్యుడవీవును దొర్యయాఖ్యుడా.
నిరతము దేశసేవకయి నీతిగనిల్చిన వీరులందు నీ
కరములుకల్పి కార్యముల కంకణధారులతోడగూడి సు
స్థిరమగు పాలనంబునకు దీనజనాళిలో దిట్టవయ్యి యా
పరమసుఖంబు కోసమయి బాధలుపొందిన దొర్యయాఖ్యుడా.

---

## ఇందువచ్చు ముఖ్య పాత్రలు.

| పురుషులు. | |
|---|---|
| పంతులు:— | (ఉపాధ్యాయుడు) |
| మునసబు:— | (గ్రామాధికారి) |
| దొరయ్య:— | (రైతు) |
| సర్వయ్య:— | (రైతు) |
| జగన్నాధం:— | (పంతులుకొడుకు) |
| గంగాధరం:— | (పంతులుకొడుకు) |
| డాక్టరు:— | (వైద్యుడు) |
| సుబ్బన్న:— | (మునసబు నౌకరు) |
| బూదెయ్య:— | (రైతు) |

| స్త్రీలు. | |
|---|---|
| శ్యామల | (పంతులుభార్య) |
| కస్తూరి:— | (పంతులు కుమార్తె) |

# బడిపంతులు బ్రతుకు

## మొదటి రంగం

[ శ్యామల ఆరాధన ]

శ్రీశార్వాణి సరోజనీ లలిత శ్రీసీమంతినీ వేణిని
వ్యాసవిద్యాధర జేతువాణి జననీ వాగ్దేవి కళ్యాణిబన్
ఆశల్ దీరగ వేడుచుంటి మదిలో నమ్మా జగన్మోహి నూ-
పాసన్ జేయుచునుంటినే భగవతీ భక్తాంజలిన్ భారతీ.

ఉక్కుచిక్కాలలో మ్రగ్గి వుపవాసములుచేసి వీరులను, వీర నారీమణులను వురికొయ్యల కాహుతిచేసి, నేటికి స్వతంత్రురాలవైన భరతమాతా నీకు జోహారులు. పరమ పవిత్రురాలవు. పతివ్రతా శిరోమణులను, దేశోద్ధారకులనుగన్న దేశమాతవు.

సీ॥ వీరశివాజినీ విక్రమార్కుని కృష్ణ
దేవరాయలగన్న దేశమాత
అంగ కళింగ వం గాంధ్ర మహారాష్ట్ర
వీరులగనిన మా వీరమాత.
వ్యాస వల్మీక శం భవ కాళిదాస భో
జాది కవులగన్న యతులఘు చరిత
రుద్రమదేవి య రుంధతీ జానకీ
పాంచాలులనుగన్న పరమపూత

గీ. దాసు భగవత్ సింగు సుభాసు గాంధి
తిలకు బాలబాయి పటేల్ మోతి, జవహరు

మదన మోహన్ మాలవ్యాది పురుషుల గని
ప్రతిభ గనినావు తల్లిరో భరతమాత.

[ పంతులు ప్రవేశం ]

ప:— శ్యామలా స్వాతంత్ర్యదినం యివాళ మన గ్రామంలో మహా వైభవంగా జరుగుతోంది. కరపత్రాల్లో ప్రకటించారు. ప్రతి యింటింట పచ్చని తోరణాలు కట్టుకొని ఆనందంతో వున్నారు ప్రజలు.

శ్యా:— మనంగూడ ఆనందంగానే వుండాలి.

ప:— ఆనందం ఊ. అడ్డెడునూకలుంటె ఆయదినాలు బత్యం గడిచిపోతుం దనిపిస్తుంది నాబోటిఉపాధ్యాయులు నెలకెన్నిపస్తులో ఎరుగుదువా

ఊ: పూటకు నొక్కమారెగద భోజనము న్దినుఁ రెండుపూటలు
న్మాటికి నొక్కరున్ దినటు నూకల రెట్టైను కొల్చుకొందురే
కాటకమేమిగాదు తమ కష్టమొకింతయు జూడకే ప్రభుల్
కూటికిలేక యొజ్జలును కొట్లుగ మాడుచునుండిరీ భువిన్.

శ్యా:— ఎందుకా నిరాశ భగవంతుడే వున్నాడు, ఎప్పుడూ ఇలాగే వుంటామా!

ప:— అధికారులకు దయలేనపుడు ఆనంద మెలావుంటుంది.

శ్యా:— ఉపాధ్యాయులోకాని కదృష్టంకలిగే రోజు లొస్తాయిగాని రాక పోవుగాని కొంతకాలం పడుతుంది.

ప:— నీవెర్రికాని పనికితగినజీతం ప్రభువులిస్తారా పంతుళ్ల బ్రతుకంటె

ఉ. చాలని జీతమిచ్చెదరు, చక్కగ విద్యను మప్పమందురే
కాలము ఎట్లుగడ్పుదుము, కల్గరపడ్డను జూడరొక్కరున్
మేళములోన యంగవలమీదనుచే యధికారమట్లులన్
హేళన చేయుచుండెదరు, ఎంతటివారలు మైన ఖూభువిన్.

శ్యా:— యిట్టి నిజాయితీగల సేవకులను లోకం గుర్తించదంటారా ?

వ:— లోకం లోభత్వంలో మునిగిపోయినపుడు పనిచేసే వ్రిజాసేవకులను దేశసేవకులను చూచేదెవరు ?

శ్యా:— లోకం గుర్తించకపోయినా భగవానుడైన గుర్తించకపోతాడా.

వ:— గుర్తిస్తే లాభమేముంది? ప్రజల్లో నిస్వార్థపరత్వంరావాలి; బహునాయకత్వం పోవాలి, మావంటివారు బాగుపడాలి.

శ్యా:— అవును ధనికవర్గం దరిద్రులను గుర్తించలేదు.

వ:— ధనికవర్గ మవనీ దరిద్రవర్గ మవనీ సమాన సంపత్తి సాభాగ్యత్వం కావాలి. స్వాతంత్ర్యంయొక్క మూలం గ్రహించాలి. అనాడే అందరికి సుఖం.

శ్యా:— నిజంగా బడిపంతులు బ్రతుకును చూచేవారు లేరు.

వ:— చూచువారేవ్వుంటె సుళువైన మార్గాలతో, సూక్ష్మమైనబుద్ధితో ఆబాలగోపాలానికి అందుబాటుల్లో అందజేసే విద్యనుజూచి అయ్యో అనకపోతారా.

మ. చలిగాల్వీచిన కారుమేఘచయముల్, చల్యింపచేయ్యుగ్గిగా
అలపిల్లల్ హృదయాల తిమిరమును పోనడ్చి మహ్వాల్గనే
వెలిగించంగల మేము తెల్వగన నావేదన్తో బోధింతుమే
బలియై పోదుము బాలబాలికలకై బహ్వోపికన్ శ్యామలా.

శ్యా:— నిజంగా అమాయకత్వమైన లోకమని చెప్పకతప్పదు.

వ:— అమాయకత్వంకాదు అతిగడుసృతనం.

శ్యా:— గ్రుడ్డిలోకమనియైనా చెప్పకతప్పదు.

వ:— గ్రుడ్డిలోకంకాదు. గుర్తించుట కేమవసరమని గర్వం.

శ్యా:— అయితే కష్టపడ్డవాళ్లు కడుపుమంటలతో చావవలసిందేనా!

వ:— చస్తే సంద్రానికిలోటా. లోకానికిలోటా.

శ్యా:— ఆనాడు విద్య నేర్చుకొని పైకివచ్చిన వారైన గుర్తించలేకపో యారు. బడిపంతులు బ్రతుకును.

ప:— ఈనాడు పదవుల్లో నున్నవారు మాత్రం గుర్తించగలిగారా బడి పంతుల బ్రతుకును.

చ. చిరిగిన గుడ్డలున్ సగము చిల్లులుబడ్డటువంటి కొంపయున్
ఒరిగిన కండ్లజోడు తెగిపోయిన చెప్పులు కొర్రపాగతో
నరుగులమీద నేర్పిన అఆలతో వచ్చిన నేటి మంత్రులే
మరుగుననున్న మాత్రమున మర్చిరె వారల దేమిచిత్రమో.

శ్యా:— చిగ్గుచిగ్గు ఎంతదయదాక్షిణ్యంలేని వారయిపోయారు.

ప:— లోకాన్ని కండ్లు తెరపించింది ఉపాధ్యాయులని గుర్తిస్తేగా దయగలగడానికి.

శ్యా:— ఎంతకాలం గుర్తించకుండా వుంటారు లే.

ప:— పదవుల వ్యామోహం తగ్గేవరకు ధనవంతులు పేదలను భేదం పోయేవరకు గుర్తించకుండానే వుంటారు.

శ్యా:— స్వాతంత్ర్యం సంపాదించుకొన్న ఫలితం యిదేనా ?

ప:— ఎందుకవుతుంది. కేవలం ధనికవర్గానికే స్వాతంత్ర్యంయొక్క సుఖం స్వేచ్ఛ పేదవర్గానికి కూలివర్గానికి ఎందుకుంటుంది.

శ్యా:— ఉపాధ్యాయులు ఏవర్గానికి జెందారండి.

ప:— దరిద్రవర్గానికంటె తరువాత వర్గానికి జెందినవారే అంటాను.

శ్యా:— ఎందుచేత ?

ప:— తెలియదా !

చ. మధుకర మెత్తుకొన్న యొక మానిసియే కడుపారగా తినున్
అదలుచుకొన్చు నావులను, హాలికు లెంతగ సౌఖ్యమొంది రే
అధములు కూలిచేసుకొని, ఆలికి పిల్లకు గంజిపోయునే
చదువును నేర్ప యొజ్జకును సార్థకమేమిక గల్గునేయిలన్

కష్టపడి పదిపంద్రెండేండ్లు ప్రజాసేవకు దేశకళ్యాణానికి దారిచూపుటకు కావలసిన విద్య నభ్యసించుటకు పిత్రార్జితమెల్ల తగుల వేసుకొని కాటికి కాళ్లు కూటికి చేతులు చాచుకొనునంత శక్తిహీనులను చేసింది యీఉపాధ్యాయ పదవి. చివర కాలంలో ఉపాధ్యాయుడు చెప్పిపోయింది ఏమిటో ఎరుగుదువా ?

మ. కొనప్రాణంబుననున్న పంతులను కూగోడేమియున్ జెప్పకే
చనుచున్నావని యాలిపిల్లలడ్గన్ జార్వేయు కన్నీరు నే
మని జెప్పేదియులేక చిప్పయని తా నందించు మున్నెల్లగన్
తన వెన్కున్నటువంటి వారిగతి నే దల్పోయుడే పంతులున్.

శ్యా:— ఇప్పటికి నాకర్థమైంది బడిపంతులు జీవితం. చాలని జీతంతో చావో బ్రతుకో అని జీవితకాలమంతా కృంగి కృషించిపోతున్న వారిగతి తలపెట్టే ప్రభులు, ప్రజలు లేకుండ పోయారు.

ప:— బడిపంతుల్ని బండెద్దుకుమల్లె పనిచేయించుకోవడమే చేతనౌనుగాని బ్రతుకును గురించి బాధపడే వారెవరుంటారు శ్యామలా.

శ్యా:— ముందుకాలంలోకూడా ఉపాధ్యాయులపట్ల ప్రజలు ప్రభువులు యిలాగే విముఖత్వం చూపేవారా.

ప:— లేదులేదు గురుత్వమంటే ఆనాటివారిదే. గురువే దైవం గురువే తల్లిదండ్రి గురువాజ్ఞ లేనిదే ఏకార్యంకూడ చేసేవారుకాదు. ఆనాడు పుట్టబడ్డవే గురుకులాశ్రమములు. గౌరవింపబడని గురు వుండేవాడుకాదు.

శా. రారాజుల్ బిరుదంబు లెన్నొబడసెన్, రాజ్యంబులందుండియున్
దారాపుత్రులతోడ నమితన్ దానంబు ధర్మంబులన్
కోరంజాలకె బొందుచుండి రపుడున్ గురుధర్మముల్ జొప్పనన్
లేరాయించిపుడేమి జెప్పకొనగన్, లేకుండగా పోయెనే.

ఉ. శిల్పమునందు యొజ్జలును చెక్కెరి వారల ప్రజ్ఞయేని సే
దెల్పగలేని మన్ననలు దెచ్చుకొగల్గిం వారలందరున్
నిల్పెను గౌరవం బపుడు । నేతలు దాతలు నెల్లవారలున్
అల్పపుబుద్ధి వారయును । యక్కట యిప్పటివారు శ్యామలా.

శ్యా:— అబ్బబ్బా ఎంతదయ గలవారు.

ప:— ఆనాడు దరిద్రంతో బాధపడే ఉపాధ్యాయులు లేరు.

శ్యా:— ఎంతధన్యజీవితాలు.

ప:— ఆనాటివారివి ధన్యజీవితాలు యీనాటివారివి పాపిష్టి జీవితాలు

శ్యా:— పోషించుదాతలుంటె పంతుళ్ల జీవితాలు బాగుపడ కేమవుతాయి.

ప:— పోషించారంటె ఉపాధ్యాయుడంటె అభిమానముండిగనుక.

శ్యా:— ఇప్పుడభిమానం లేదంటారా ?

ప:— ఎన్ని సూత్రాలుపన్నితే ఏమిలాభం. ఆ పైగ పగవ్రానుట ఎరుగని వ్యక్తులు, పుట్టుకతోనే వోరిమి, వోపిక, దైవభక్తి గలిగి వుంటారు.

శ్యా:— నిజమే.

ప:— ఒక సత్యానికి కట్టుబడి వుంటారు.

శ్యా:— అందుకొరకే తిండిలేదు,

ప:— లేకపోయినా లెక్కచేయం.

శ్యా:— జీవించడం కష్టంగా,

ప:— దరిద్రం అనుభవించడంతప్ప జీవితం పోదుగా. బ్రతకడంకొరకే తింటున్నాం తినడంకొరకు బ్రతుకుటలేదు.

శ్యా:— అనే సంతృప్తిని పడుతున్నాం.

ప:— ఏంచేస్తాం. పరమార్థంకొరకే పనిచేస్తున్నాం అనుకోవాలి.

శ్యా:— ఇంతకు యీవేళ మనంచేయు కార్యక్రమం మర్చిపోయాం.

ప:— ఈవేళ జెండాప్రతిష్ట, బ్రహ్మాండమైనఊరేగింపు జరుగుతోంది

శ్యా:— మనంకూడా వెళ్లాలా?

ప:— తప్పకుండా పాల్గొనాలి బడిపిల్లల నందరిని తీసికొని.

శ్యా:— మనయింటిముందు జండాప్రతిష్ట చేయరా ?

ప:— తప్పకుండా చేయాలి. యిదిగో జండాకూడ తెచ్చాను. గ్రామములో ప్రజలంతా వొస్తారు. నర్సయ్యా, బూదెయ్యా, నారయ్యకుకూడా చెప్పాం. వాళ్ళుకూడ వొస్తున్నారు.

శ్యా:— మీరంత దేశాభిమానం చూపించబట్టే స్వాతంత్ర్యం రాగలిగింది.

ప:— అంతఅభిమానం కలగడానికి ఎన్ని విధాలో బాధపడ్డాను.

శ్యా:— అందుకొరకే మీరంటె చాల అభిమానం వారికి.

ప:— దానిలో సందేహంలేదు.

[ నారయ్య బూదెయ్య నర్సయ్య ప్రవేశం ]

అందరు:— నమస్కారం పంతులుగారు.

ప:— నమస్కారం రండి ఆరాధనకు.

( జెండాఎత్తి జాతీయ గీతాలు పాడును. )

( తెర పడును. )



# బడిపంతులు బ్రతుకు

## రెండవరంగం

[ మునసబు — సుబ్బన్న ]

ము:— సుబ్బా.

సు:— (లోపలినుండి) బాబు.

ము:— ఇలారా.

సు:— (ప్రవేశించి) ఏంబాబు తొందరగా పిలిచారు.

ము:— చూడు ఆపంతులు మనకు డబ్బివ్వాలి. ఎప్పుడడిగినా రేపు మాపు అంటున్నాడు. నోటుచూస్తే కాలదోషం పట్టేలావుంది. వొక్కసారి నేను రమ్మన్నానని తీసుకురా.

సు:— బాబుగారు పంతులు మీాకు అప్పతీర్చస్తాడా. మీారు పుచ్చుకుంటారు. యింటిముందప్పు యింటి వెనుకప్పు యింటిచుట్టు అప్పులే అంతా తినగలిగిన పిల్లలు.

ము:— అయితే జీతమేమవుతుందిరా.

సు:— ఏంవిజీతమేటండి. వొందలా వేలా. మూాడు పదులు పట్టుమని పదిరోజులురావు. నే నెరిగినప్పటినుండి పంతుల్ని చూస్తూనే వున్నా. ఆపెళ్ళానికేమిట్టా అంటె సరైన గుడ్డముక్కేలేదు. సరేగదా ఆకురక్రిందికి చెప్పనక్కరేలేదు. వొకరోజుతింటె మూడురోజులు పస్తు.

ము:— అలాగా అంత పెద్దమనిషా ఆపంతులు. అయితే అడగకుండ ఎంతకాల మూరుకోమంటావురా సుబ్బా. నేనూరుకుంటె

నోటూరుకుంటుందా. దానంతటది పిల్లల్ని పెడుతూనేవుంటుంది. అంతా తీర్చవచ్చేసరికి అతనికిమాత్రం కష్టంకాదూ. యిప్పటికే మూడురోజులు తక్కువగా మూడేళ్లయింది. నోటుచచ్చిందీఅంటె మనకుమాత్రం కష్టంకాదటా.

సు:— కష్టమూ కష్టమున్నర. ఏదోమాదిరిగా రాబట్టుకోవాలండి దొరగారు.

ము:— అయినా ఏంచెబుతాడో యిల్లాతీసుకురా లేదంటె దావాపారేద్దాం.

సు:— చిత్తం చిత్తం. తప్పకుండా పారేద్దాం బాబు. తాడో పేడో తేలాలి. ( నిష్క్రమించును. )

ము:— వడ్డీడబ్బుల కాశపడితే అసలకే మోసం వచ్చేటట్టు కనిపిస్తుంది. కోర్టులో దావాపారేస్తేగాని మనకు ఏమాత్రం డబ్బుదక్కేటట్టు కన్పించడంలే. యింతకు కోర్టుకెక్కితే ఏముందీ అని చిరాస్తాలేదు. చరాస్తాలేదు. యింకెలావొస్తుంది. పాతికేళ్లనుండి అద్దికొంపలోనే వడున్నాడు. నగాలేదు నాణ్యాములేదు. కాసుకు గతీలేదు. నూటికిపర్యాలేదనేరకం. అడిగీ అడిగీ ప్రాణంవిసిగెత్తిపోయింది. ఏంచెయ్యాలో ఏమీతోచడంలే అబ్బబ్బా దిక్కుమాలిన అప్పులుగొడవలు యిలాగేవున్నాయి.

[ సుబ్బన్న పంతులు ప్రవేశం ]

వ:— మునసబుగారు సమస్కారం.

ము:— ఏంనమస్కారంలే చాలా మంచివాడవనుకున్నా వడ్డీ యిచ్చావుకాదు అసలు యిచ్చావుకాదు. అలాగే వూరుకుంటె నోటు కాలదోషం పడుతుందిలే అనుకున్నావా ?

వ:— మీాబిడ్డలకు అయిదేండ్లు ప్రవేటుచెప్పాను. తద్వారా ఏదో తీరుపోతుందని వూరుకున్నా.

ము:— చీ. నోరుమూయ్. ఆ. అదానీఎత్తు. నేనెవరినో ఎరుగుదువా

ప: ఎరుక్కే. గ్రామాధికారివి.

ము:— హా.హా.హా. ఊఁ. తెలిసే డబ్బాడుగుతున్నావ్. అప్పుతీర్చకపోతే నన్నేం చేగలడనుకుంటున్నావ్. డిష్ట్రిక్టుబోర్డు మనచేతిలోది. ప్రశిడెంటు నామేనల్లుడు, మెంబర్లంత మనబంధువర్గం, ప్రభుత్వం మనంచెప్పినట్లుగా నడవవలసిందే. నాఅప్పెగగొట్టి ఎక్కడ జీవిస్తావ్. మనంతలంచామా అంటె యీ జన్మానికిలేదు సరే గదా మళ్లీజన్మానికూడ ముక్తిలేకుండ చేగలం. మనపేరుచెబితే పెద్దపులులు నీళ్లుతాగ్రిగా ఎరుగుదువా ఏరాసుబ్బా ?

సు:— చిత్తంచిత్తం. మనమెరుగుదుంగా.

ప:— గ్రామాధికారివి న్యాయాన్యాయ విచక్షణచేయు మహనీయుడౌ ధర్మమాలోచిస్తారనుకున్నా.

ము:— అయితే నిన్నధర్మం చేశానంటావా.

ప:— ధర్మానికిచ్చిన వొరెకట్టకూడా ఋణంకిందనేచేర్చారు.

ము:— ఆ. ధర్మం దాచిపెట్టావ్ ఎవడిబాబుసొమ్ము తెమ్మంటావ్.

ప:— వూరికేయిచ్చారా. కవుళ్ళు కదపాలు వ్రాసినందుకు ధర్మంగా యిచ్చారు.

ము:— గ్రామాధికారిని చెబితే ఎవరికోసం వ్రాస్తావ్. వ్రాసిపెట్టావని అప్పుగా యిచ్చాను. అయితే చాలమట్టుకు వచ్చిందన్నమాట మనవ్యవహారం సుబ్బా.

సు:— బాబు,

ము:— యీపంతుల్ని రేపు సాయంకాలానికల్లా ప్రెసిడెంటుతో చెప్పి వూష్టుచేయిస్తా జప్తిచేయరా.

సు:— చిత్తం తప్పకుండా వూడబెరికించాలి.

వ:— అయ్యా అంతపనివొద్దు నేను పిల్లలగలవాణ్ణి.

ము:— హా.హా.హా. జాగ్రత్త మనగ్రామంలోనేమి మరొకగ్రామంలోనేమి ఆబాలగోపాలం మనకు లొంగివొంగి యుండవలసిందే ఏరా సుబ్బా.

సు:— అవునండి బాబు మనటీవికి ఎవరుసరిపోతారు. పంతులు కింకా తెలియదు.

ము:— సుబ్బా భార్య ప్రసవించిందీఅంటె పాతికరూపాయ లిచ్చా. మూడునూసాలనుండి బోర్డుజీతాలు పంపించడంలేదూ అంటే ఏబదిరూపాయలిచ్చా. యింటిఖర్చుకంటె ఏబదిరూపాయలిచ్చా పిల్లలగలవాడని అడ్డుపడినందుకు ఆకాసింతమర్యాద నిలబెట్టుకో లేకపోయాడు. యింకెంతకాల మూరుకోమంటావ్ పంతులు. కోర్టులోదావా పారేయమంటావా.

ప:— మునసబుగారు నాకష్టకాలంలో అడ్డుపడి నాకెంతో మేలుచేశారు. మీకునాధన్యవాదాలు. మీ ఋణంఏదోవిధంగా తీర్చుకుందామను కొంటున్నా వొకరోజుకొకరోజు అనేక అవాంతరాలు అలలకు మల్లె అమాంతంగా మీదపడుతున్నై సుఖమేలోకాన్ని కన్పించడంలే.

ము:— అదిగో ఎప్పుడడిగినా ఏవోకష్టాలు వొలపోస్తావ్. పంతులు—జీత మంతా ఏంచేస్తావ్.

ప:— జీతం.నావుద్యోగానికి సరిపడినజీతమా రోజునకు ఎనిమదిగంటలుపని చేసిన కూలివానికిచ్చు కూలియివ్వరు. రోజల్లా వాగివాగి గుండెగరిసెలుపడినట్లు నాశక్తినంత దారపోసి నాలోపలున్న అమూల్యమగు భావాలన్నిటిని కసుగాయలైన పసిపాపల హృదయాల కెక్కించేసరికి నాబుర్రంతవేడెక్కి నీరుపీడిన తామరపువ్వు సూర్య కాంతికి వాడినట్లు సాయంకాల మగుసరికి జీవశ్చవమునై ఏమూలనో కూలబడిన నాకు కడుపునిండాకూడు వొంటినిండాగుడ్డా—

సీ॥ ముప్పదిదినములు చెప్పగా చదువును
కడుపునిండుగకూడు కానరాదు
గరిసెలుబడి గుండె గరువగా విద్యను
తలదాచుకొనకొంప యిలనులేదు
పసికూనలకువిద్య విసుగులేకనునేర్ప
కట్టగుడ్డకుకూడ కరువుయయ్యె
శక్తికొలదిబోధ సలువగా ఏనాడు
యిసుమంతసుఖము నా కిలనులేదు.

గీ. పనికితగినంత జీతము ప్రభువులియరె
కూలిపనివానికన్న తక్కువగనైతి
ఏమిజీవింతు ఋణమునిం కెట్లుదీర్తు
నూయబడిచచ్చుటేని యు పాయమయ్యె.

ము:— ఆఆ ఏమిటదీ నీకు ఋణమిచ్చిందిగాక తిరిగినన్ను అరెస్టుచేయించ డానికా నూతిలోపడిచావడం. అయితే యిప్పుడే కోర్టులోదావా పారేస్తా.

ప:— మునసబుగారు దావాచేస్తేమాత్రం నావద్దేముంది. చిరాస్తాలేదు చరాస్తా అంతకంటెలేదు అన్నిటికిని త్రాడుత్రెంచుకొని కూర్చున్నా. ఏమన్నా చేస్తే మనుష్యులంమాత్రం మిగిలున్నాం.

ఉ. కొంపయులేదు తన్కకును కోమలిశామపకూడ తాడుకా
తెంపనుతాడులేదకట తెచ్చెదువారిక వెన్కలేరు ఏ
సంపదలేదు పూర్వికుల సంగతి చెప్పగసిగ్గుచేటు నే
బెంపగనొక్కరెక్కపై పెండ్లముబిడ్డల భారమిప్పుడున్.

ము:—పంతులు ఎంతపనిచేశావ్ నీమాటలుచూస్తే నామనసంత తరుక్కు పోతుంది. నేనిపుడేమిచేయను నెలకేదోవిధంగా యివ్వనన్నా యిస్తే ఏదోవిధంగా చెల్లుబ్రాయించి పొదలకొట్టేద్దామనుకు

న్నా యిన్నాళ్లవరకు పంతులంటె గొప్పజీతగాడని భ్రమపడ్డా. పాతికముప్పదిజీతమంటె అప్పుఅసలే యివ్వకపోదును. ఆపైగా నీవెవ్వరవో నేనెరుగను నీదేవూరోనాకుతెలియదు, బడిపంతుల వుగదా పేదరికములోనున్నావని కనికరించి సహాయంచేస్తే చివ రకు వట్టిచేతులుచూపావ్ అంతేకదూ ?

ప:— మిమ్ములనుమోసంచేయాలని ఎన్నడు మనసులోతలంచలేదు తలం చను. నేనేకాదు నాకోడి ఉపాధ్యాయసోదరులెవ్వరు మోసం చేయడానికి తలంచరు. వాకసత్యానికి కట్టుబడియుంటాము. భగ వంతుడు అట్టిపాపపుపనిమాత్రం మాహృదయాల్లో వుంచలేదు. తలిదండ్రులు పసిపాపలనుదెచ్చి మీరేతలిదండ్రులని మాచేతు ల్లోపెట్టిపోయినపుడు మేంకేవలం ఆధ్యాత్మికవిషయాల్తోకూడిన మహావాక్యాలే పునాదివేయడానికి ప్రయత్నిస్తాం మోసంచేసి పసిపాపల వుసురుపోసుకోవడానికి ఎన్నడు తలంచం. మేమేవిత్తన మైతే నాటడానికి ప్రయత్నిస్తామో అదేఫలిస్తాదని మాకానమ్మ కంవుంది. యీనాటిప్రభువులు పరిపాలనకు అమోఘమైనశక్తి యుక్తులకోని చ్చెడి సలహాలెక్కడివి. ఆనాటి మాఉపాధ్యాయ బృందంనాటినభీజమే యీనాటి మహావృక్షముయొక్క ఫలితం.

ఉ. బేధములేకయేను కడు పెద్దకుచిన్నకు నొక్కటీరుగా
బోధనచేయగా నిపుడు భూపరిపాలకులయ్యిరేంఖలన్
జోతలుచేయుగాయిపుడు జూడరుమాగురులంచు నొక్కరున్
బాధలుబాపువారు బడి పంతుల పేదతనంబు. బాపరే.

శుంఠలను శూరులనుజేసి వాణీమహాదేవిని దిక్కరించు శక్తిసంప న్నులజేసి న్యాయాన్యాయ పరిశీలనచేయు శాస్త్రవేత్తలచేసి గ్రామపరిపాలనా ప్రవీణులనుచేసి ఘణితశాస్త్ర కోవిధులజేసిన యొజ్జకుయీనాడు కడుపారకూడు వొంటెనిండాగుడ్డ బిడ్డలనుచది

వించుకొనుటకుదుడ్డు వుండా లేదాయను న్యాయమెరిగినవారు న్నారాఅని తలంచుకొంటె.

ఉ. మాగురువంచు గొప్పగను మాత్రము జెప్పకొనంగుజాతురే
నాకొరకే నివాగతడు నాటినబీజము నేటివృక్షమే
బోగియు నైతినంచిలను భూసురులేరు తలంచరేలకో
లోకమునందు మావిలువ లోకులు ఏరుతలంచరే మొకో.

పిచ్చిపంతులు ఎద్దుపుండు కాకికిముద్దా మీగోడెవరింటాను. ఎవరిబాగు వాళ్లేచూచుకుంటాను. కాని నీవన్నట్టునిజమే విద్యా దానంచేసి ప్రపంచాన్ని కండ్లుతెరపించింది మీఉపాధ్యాయులే. నామట్టుకునేను లక్షాధికారినయ్యానుఅంటె నాచిన్నతనంలో జ్ఞానోదయంచేసి కండ్లుతెరిపించి మాడవనేత్రాన్ని కలుగజేసింది మీఉపాధ్యాయబృంధమే దానిలో సందేహంలేదు. దీనినెవరు కాదనలేరు కాదన్నవారికి హృదయమేలేదంటాను. అయితే మీరుబాధపడిచెపుతున్నారో లేక సుఖపడిచెబుతున్నారో చదువను పరిజ్ఞానం ఆనాడు ఎవరుగ్రహిస్తారు. యీనాడు పైకివచ్చిన పెద్దన్నయ్యలు ఆలోసించాలి.

అలా ఆలోసించే మహానీయులేవుంటె యిలా ఎందుకుంటాం. దేశ కళ్యాణానికి దారిచూపినయొజ్జలు బాల్యదశలోనున్న గోచిపాత రాయిళ్లుగానున్నపుడు బుజ్జగించి మాఅంకపీఠాన్ని కూర్చుండ బెట్టుకొని గారావముతో గరిపిన విద్య యీనాడు అమోఘంగా నవభావాల్తో ఆబాలగోపాలాన్ని పరిపాలించేభాగ్యాన్ని లభింప జేసిందిఅంటె దరిద్రులై ఏకొండమూలనో పడియున్నపల్లెటూరు బడిపంతులు ప్రజ్ఞలఅని తలపోసే మహనీయులేరి. చెప్పకొన్న సిగ్గు చేటు తిన్న తినకపోయిన నాశిష్యులేగదా నేటిప్రభువులని మహా నందభరితులమై సంతృప్తినజెందుచున్నాం యింతకంటెనా దీన స్థితిని ఏంచెప్పకోకల్గుతాను.

సీ॥ వుగ్గుపాలనువీడి యుండిన పసిపాప
నాసికన్ తుడిచెనా నాడు యొజ్జ
ఆనాడు బాల్యాన జ్ఞానమొసగనినాడు
అపుడుగోచినిబెట్టి నట్టిగురువు
బడికిరాననుచును పారిపోయినబిడ్డ
బట్టి చంకనుదెచ్చు పంతులయ్య
కండ్లపుసినితీసి పండ్లనుతోమించి
మొగమును గడిగించు ముదమునొజ్జ
గీ. బాబు అమ్మలకునుగల బాధ్యతలను
నెత్తిపైపెట్టుకొనిమోయు జిత్తమార
ఎన్నికష్టాలకును లో నైనగాని
దయను సత్యంబు చూపు న ధ్యాపకుండు.

సు:— పాపం ఎంతబాధ పడుతున్నాడండి పంతులు మనకోసం

ము:— ఛీ, నోరుమూయ్. పంతులు ఇన్ని చెప్పినా బాకీ ఎగవేయడానికి పన్నిన పన్నాగమా, చక్కనివుపాయమే పన్నావ్ ఏదెలాగున్న అప్పుమాత్రం తీర్చకతప్పదు.

ప:— మునసబుగారూ బాకీవున్న తరువాత తీర్చకతప్పుతుందా, ఎగవేయడానికి నాకుమాత్రం హృదయం లేదంటారా!

ము:— ఇంకెలా తీరుస్తావ్ నీజీతం నీకు సరిపడదు. వెనకా తెచ్చేదారి లేదు గొర్రెతోకమల్లె జీతమెచ్చదు తగ్గదు.

ప:— కరువుబత్యమేదో ఇచ్చేటట్టున్నారు. వచ్చినతరువాత వడ్డీనైనా కట్టేస్తా.

ము:— అలాగైతే చూడు మర్చిపోవద్దు. ఒకవేళ దొరయ్య తనప్పిమ్మని జబరదస్తీ చేస్తాడు. ఇవ్వద్దుసుమా!

ప:— మీబాకీ ముందుతీరాకే అతనిబాకీ తీరుస్తా నమ్మరా!

ము:— ఎంతమాట నీమాట ఎప్పుడు నమ్మలేదు.

ప:— నమ్మందే ఇంతబాకీ నా నెత్తినిపెడతారా? మరొకమాట-మూడు రోజులనుండి అన్నానికి మాడి చచ్చిపోతున్నా, ఏమన్నా గింజ లుంటే పెట్టండి.

ము:— అలాగే, ఆమాత్రానికే ముగం చూచుకుంటానా నాసంగతి ఎరుగని మనిషికిమల్లే మాట్లాడావే, సుబ్బా

సు:— బాబు

ము:— పంతుల్ని మన పొలానికితీసుకుపోయి తుమ్మపీకివద్ద చిన్న మేటులో ఒక వరికట్ట తీసిఇవ్వరా! పాపం మూడురోజులనుండి గంజికాచు కోడం లేదంటున్నాడు.

సు:— చిత్తంబాబు, చిత్తం. ఉపకారమంటే మీకాదేనండి జాలిగల గుండెకాయ. రావయ్యా పంతులు, రెండుమాటలంటేగాక రెట్టిముక్క నేతిలోపడ్డాది. (నిష్క్రమించును)

ము:— ఏదోవిధంగా అప్పు రాబట్టాలి, లేకపోతే చచ్చినంతపని. ఇంతకు పంతులికి కరువుబత్యమొస్తుందా లేక నావద్ద మాయవస్నేడా, ఎందుకయినా మంచిది అయిదురూపాయిలు చార్జి. ఒక్కసారి డిస్ట్రిక్టుబోర్డు ఆఫీసుకుపోయి కనుక్కోవాలి. ఆ యాఫీసులో ఏమిట్రాఅంటే ఆదొంగముండాకొడుకులు అసలేచెప్పరు. లంచం ముందిస్తేనేగాని ముక్తి లేదు. అంతకు చెప్పనంటె మన అంకినీడు బోర్డుమెంబరు ఆతనికి చార్జికట్టానంటే అతడేవస్తాడు నిజం సంగ తేమిటో అప్పుడే తేలిపోతుంది. ఏదో తంటాలుపడాలి. అందుకే అన్నారు అప్పుచేయుటరోత హరిహరాదులకైనా అది పొర పాటు. అప్పులిచ్చుట రోత హరిహరాదులకైనా. అంటె చాలా బాగుంటుంది. ఇప్పుడునాకు అనుభవానికొస్తుంది. ఈ విషయా లన్నీ. ఆలస్యం అమృతం విషం. దేనికైనా తొందరపడాలి,

(సుబ్బయ్య ప్రవేశం)

సు:— బాబు పంతుగారి కిచ్చివంపేశా.

ము:— మంచిది మనప్పు ఇచ్చేటట్టు కనిపించడంలేను. దావా తప్పదను కుంటానే ?

సు:— ఏలా తప్పుతుందండి బాబు తలమునిగి తాడిప్రమాణం అప్పు పెరిగిపోతేను.

ము:— లేదు వాడనుకున్నాడు మనపిల్లకాయలకి ఏవో నాలుగుముక్కలు చెప్పాడుకదూ దానికి నాఋణం చెల్లను వుద్దేశంతో మాట్లాడ కూరుకున్నాడు. లేకపోతే తీర్చకపోనంటావా?

సు:— ఏంతీరుస్తాడుబాబు తెచ్చుకున్నబత్యం చాలక దినమొకేడుగా గడుపుకొంటూంటె అప్పుతీర్చుటకూడానా!

ము:— నీవుకూడా వాడిమాటే ఆడావురా సుబ్బా?

సు:— అమ్మమ్మ ఎంతమాట అతనిమాటెందుకాడతాను బాబు.

ము:— లేదులే నీకుర్రాడికి నాలుగుముక్కలు బాగా చెపుతాడని అలా అనుంటావ్. ఎవడిబాబుసొమ్మురా విడిచిపెట్టడానికి ఇప్పుడేవెళ్ళి దావా పారేస్తాచూడు (నిష్క్రమించును)

సు:— పాపం ఈదుష్టుడు పంతులుమేలుమరచి అతన్ని పాడుచేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ధర్మానికిచ్చిన వరికట్టలనుకూడా పద్దులోనే బాకీక్రిందరాసి దావాచేస్తానన్నాడంటే ఎంత పాపిష్టిముండా కొడుకో చెప్పలేను. పాపం పంతులుచేత దొంగపద్దులు వ్రాయించాడు. దస్తావేజులా వ్రాయించాడు. కవుళ్ళు కదపాలా లెక్కలేవు. స్వంత గుమస్తాకుమల్లే వుపయోగించుకున్నాడు. ఏరోజున తన పిల్లలకు చదువు చెప్పకపోతే ఆనాడే బెదిరిస్తాడు నాకున్న గౌరవంకూడాలేదు. పంతులుబ్రతుకంటే ఇప్పటి కర్థ మైంది. దొరగారికి నామీద కోపమొచ్చింది నన్నేమంటాడో, ఏమన్నా లెక్కచేయను. ఈనౌకరీతో నాకు లెక్కలేదు.

(తెర వ్రాలును)

# బడిపంతులు బ్రతుకు

## మూడవరంగం

[ పంతులు శ్యామలా జగన్నాధం గంగాధరం కస్తూరి ]

క:— అబ్బా బాధ, బాధ.

ప:— తల్లీ ఏమిటమ్మా బాధ

క:— నాన్నా ఆయాసంగా వుందండీ, అబ్బా అబ్బా

ప:— శ్యామలా యిప్పుడేంచేయను.

శ్యా:— ఏవైద్యునివొద్దకన్నా వెళ్లిరండి అమ్మాయిబాధ చూడలేక పోతున్నా.

ప:— శ్యామలా వుచితార్ధంగా ఏవైద్యుని రమ్మంటే వొస్తాడు.

శ్యా:— అమ్మాయినైన తీసుకుపోయి చూపించండి.

ప:— నడిచిరాలేదు. బండికైనా నావద్ద డబ్బులేదు. మూడుఫర్లాంగుల దూరముంది ఏంచేద్దాం.

శ్యా:— డబ్బుయిస్తామని తీసుకురండి.

ప:— వొచ్చినతరువాతైన యివ్వొద్దా.

శ్యా:— జీతమొచ్చేవరకు వుండమని బ్రతిమాలుకుందాం.

ప:— శ్యామలా అటువంటి మోసం ఎన్నడు చేయలేదు యికచేయను. ఉపాధ్యాయుని కది మర్యాదకాదు. కలకాలం గర్భదరిద్రంతో బాధపడినా వోర్చుకొని ప్రపంచానికింత విద్యాదానంచేయుటే భగవత్ సంకల్పమేమో అనుకుంటూ విధివిధానాని కడ్డుతగులు వారెవరు?

జ:— నాన్నగారు కడుపు మండిపోతుందండీ ఏమన్నావుంటే పెట్టండి కండ్లు తిరుగుతున్నై.

గ:— నాన్నగారు ఆకలివేస్తుందండీ వొకకానీవుంటె యివ్వండి చేగోడీ అయినా కొనుక్కుంటాను.

ప:— కానికూడా లేని అసమర్ధుడనయ్యాను శ్యామలా రాత్రి కాల్చిన చోడిరొట్టెమైనవుంటే పిల్లలకు పెట్టవే.

శ్యా:— లేదండీ రాత్రి పిండి తక్కువగావుంది రెండురొట్టెలేచేసి మీకు పిల్లలకు పెట్టాను.

ప:— నిన్న దొరయ్యగారిచ్చిన చోడికట్ట ఏమైనా నలపలేకపోయావా?

శ్యా:— రెండుదినాలనుండి నాకు తిండిలేక నీరసంగావుండి నలపడానికి శక్తి లేకపోయింది.

ప:— ఆకట్ట ఎక్కడ పెట్టావ్?

శ్యా:—అటకమీదనే పెట్టా.

ప:— (పంతులు తెచ్చి నలుపును) ఇదిగో త్వరగా దంచి కాసింత రొట్టె చేసిపెట్టు.

శ్యా:— పుల్లలుగూడ లేవండి.

ప:— అయ్యయ్యో! నావద్దకూడ దమ్మిడీలేదే యిపుడేం చేద్దాం. బాబు జగన్నాధం నీవు స్కూలుకు వెళ్ళవా?

జ:— నాన్నగారు యింగ్లీషుపుస్తకం లేదని నిన్ననే బయటకు పంపివేశారు మా క్లాసుటీచరు.

ప:— అబ్బబ్బా ఎంతదిక్కుమాలిన బ్రతుకయ్యిపోయింది యింకా పదిహేనురోజులు గడిస్తేనేగాని జీతం చేతిలోకిరాదు అంతవరకు ఎలాజీవించాలో తెలియదు.

(నర్సయ్య ప్రవేశం)

న:— (లోపలనుండి) బాబు పంతులుగారు

ప:— ఎవరు?

న:— నేను నర్సయ్యను కొంచెం తలుపుతీయండి.

ప:— (తలుపుతీసి) నర్సయ్యా నీవా వొచ్చావేం?

న:— మా చంటిదానికి బాలగ్రహ తగిలింది రక్షరేకేమైన యిప్పించండి.
(పుస్తకంలో రాగికాని పెట్టెంచును)

ప:— (పంచాంగం చదువును) నీళ్ళవిరేచనాలు, తలనొప్పి, పాలుకక్కోడం, మగత, జ్వరం నర్సయ్యా యినన్నీ వున్నాయా.

న:— లేకేంబాబు మీరుచదివిన వన్నీవున్నై.

ప:— (రక్షరేకు వ్రాయును) ఇదిగో రక్షరేకు తీసుకుపోయి మెడలోకట్టు యీమాత్రి చనుబాలతో అరగదీసి లోపలకువేయి,

న:— అలాగే, యిదిగోనండి రూపాయి.

ప:— వెళ్ళిరా సాయంకాలం వచ్చిచూస్తాలే.

న:— మంచిదండి (నిష్క్రమించును)

ప:— శ్యామలా యీకానీతో పుల్లలకట్టతెచ్చి రొట్టెకాల్చు, జగన్నాధం యీరూపాయి తీసుకుపోయి పుస్తకంకొని స్కూలుకు వెళ్లు.

శ్యా:— రొట్టెకాలుస్తా తినివెళ్లునాయనా.

జ:— అమ్మా మధ్యాహ్నం వచ్చి తింటాలే (నిష్క్రమించును)

ప:— శ్యామలా మనదిక్కుమాలిన గర్భదరిద్రాన్ని చంటిబిడ్డలుకూడ తెలుసుకోగలిగారు. ఆదరిద్రనారాయణునికి యినుమంత కనికరమైన లేకపోయింది.

శ్యా:— పొరపాటు దయలేనిదే రొట్టెకాల్చుకోడానికి పుల్లలకట్టకు డబ్బెవరిచ్చారు దరిద్రనారాయణుడేకదా యిచ్చింది.

ప:— నిజం బాధకొద్దీ ఆపరమాత్ముని నిందించా, శ్యామలా చంటిరోగం తగ్గేటట్టు కన్పించడంలే, అలాపోయి ఎవరినన్నా వొక్కరూపాయి బదులడుక్కొస్తా జాగ్రత్తగా పిల్లను చూస్తుండు.

శ్యా:— రొట్టె తయారుచేస్తా తినివెళ్ళండి.

ప:—చేసిన రెండురొట్టెలు మనంతింటే చంటిబిడ్డ లల్లాడిపోతారు. వాళ్ల కడుపుమంట చల్లార్చు. (పంతులు నిష్క్రమించును)

(శ్యామల విగ్రహారాధన చేయును)

భగవానుడా కాసింత దయజూపి నాబిడ్డరోగం నివారణ చేయి తండ్రీ నీవుతప్ప మాకెవరు సాయంచేస్తారు ఆపద్బాంధవుడవని బిరుదువహించావ్.

సీ॥ నవమాసములు యుంచి అవనిలో విడనాడి
పెంచి పెద్దగజేయు పెన్నిదీవు
కావలసినవెల్ల కల్పించినాడవు
సుఖముచేకూర్చిన సుచ్చరిత్ర
కనురెప్పతీరుగ కాపాడిపెంచిన
కరుణాసముద్రుడో కన్నతండ్రి
అనవరతమెదలో నాసీనుడవుయయ్యి
ఆపదలకు నీవు యడ్డుపడుచు

గీ. జీవకోటికినాధార మీవుకాదె
చిచ్చువలె మండుచున్నట్టి చిత్తమందు
చింతలను మటుమాయము చేతువీవు
రమ్ము మాయాపదలు దీర్ప రంగరంగ.

ఈఆపదలో నీవుతప్ప యింకెవ్వరుకాపాడలేరు. నామనోవిచారాన్ని ఎడబాపు దీనబాంధవుడవు గజేంద్రుని మొరాలించి కాపాడిన కన్నతండ్రివి. (భక్తిలో నుండును)

(పంతులు ప్రవేశం)

దైవమా అడగరానివారినెల్ల అడిగాను. ఎక్కరాని గుమ్మమెల్లా ఎక్కాను. వొకరైన వొకదమ్మిడీ అప్పుయిచ్చారుకాదు.

శ్యా:— భగవానుడా దయలేదా?

(నర్సయ్య ప్రవేశం)

న:— పంతులుగారు.

ప:— ఎవరు?

న:— నేను నర్సయ్యను.

ప:— (తొందరగా) ఏం నర్సయ్యా మళ్ళావొచ్చావ్,

న:— వొక ప్రాంసరీనోటు వ్రాసిపెట్టండి. అంకినీడువొద్ద వందరూపా యిలు బదులుపుచ్చుకుంటున్నా.

ప:— మంచిది అలాకూర్చో (తొందరగా వ్రాసి) నర్సయ్యా యిదిగో తీసుకుపో.

న:— దస్తూరి వ్రాశారా.

ప:— వ్రాశాను.

న:— మీబహుమతి యిదిగో. (రూపాయి యిచ్చును)

ప:— సరేవెళ్ళిరా (నర్సయ్య వెళ్ళును)

శ్యా:— అడ్డుపడ్డాడు భగవంతుడు.

ప:— శ్యామలా డాక్టరుగారిని తీసుకురమ్మంటావా?

శ్యా:— తొందరగా వెళ్ళండి. (పంతులు వెళ్ళును)

క:— అమ్మా దాహమేస్తుందే మంచినీళ్ళుతే.

శ్యా:— ఇదిగో కాస్త నెమ్మదిగా లేచి పుచ్చుకో.

క:— (లేచిపోవును) అబ్బాబాధ.

శ్యా:— ఎలావుందమ్మా.

క:— చాలాఆయాసంగావుందమ్మా నాన్నేరి?

శ్యా:— డాక్టరుగారిని తీసుకురావడానికి వెళ్లారు.

క:— నాగురించి నాన్నెంత బాధపడుతూన్నారమ్మా.

శ్యా:— ఏంచేస్తారమ్మా విధివిధానంతప్పించడం ఎవరితరం. ఎన్నికష్టా లొచ్చిన భరించకతప్పదు.

క:— అమ్మా తల నాస్వాధీనంలో లేదు. గుప్పుగుప్పున పొడిచేస్తుంది
తైలమున్నా మర్ధనచేయి.

శ్యా:— తైలమున్నా తాగత్తుకూడావుందా తల్లీ! కాసింతవోపికపడితే
డాక్టరువొస్తాడు మందిస్తాడు భగవత్ ప్రార్థనచేయి తగ్గిపోతుంది.

క:— తగ్గేటట్టు ఏమీకన్పించడంలేదమ్మా క్షణక్షణానికి రోగమధికమవు
తూంది.

శ్యా:— (తనలో) పరమాత్మా దీనరక్షకుడవని బిరుదువహించావ్ రా
తండ్రి నోరెరుగనిబిడ్డ బాధపడుతోంది నివారింపు.

సీ॥ పరమభక్తులయందు పతివ్రతామణులందు
దయజూపి కాపాడి దనరినావు
అలనాడు ద్రౌపతి వలువలిప్పిననాడు
మానంబునెల్ల కాపాడినావు
భక్తప్రహ్లాదుని పరితాపమునువిని
బాధలన్నింటిని బాపినావు
భర్తప్రాణమునిల్వ భక్తసూయకు
పతిభిక్షబెట్టి కాపాడినావు

గీ. ఆయువున్నొసంగితి మార్కండేయుకీవు
భక్తుడైనట్టి ధృవుని కాపాడినావు
బాపితివి కష్టములు సక్కుభాయికీవు
ఏలనాకష్టములు బాప జాలిపడవు.

గాలి తుఫానులో నౌకమల్లె మా బ్రతుకంతే నిరర్థకమైపోయింది.
ఎప్పటికప్పుడు ఏనాడో మాప్రాణాలు గుటుక్కుమనునాయని
గుండెలు చేత్తోపట్టుకొని జీవచ్ఛవముల్లాగ గర్భదరిద్రంతో బాధ
పడుతోన్నాం. మాకు నేమంత వోదార్పుకుందమన్న కడుపు
మంటతో కడుపు వెన్నుకంటుకొని పోయిన పసికూనలనుచూస్తే

ప్రాణాలెగిరిపోతున్నై. దినదినగండంగా కాలంగడుపుకోవాలసి వచ్చింది. పరమేశ్వరా వొకసారి నీకడసారిచూపు మామీద ప్రసరింపచేయుము తండ్రీ.

ఉ. కూడునుగుడ్డలేదు పని కూనలపెంచెడు శక్తిలేదు నా
తోడును నీడలేదయిక తొయ్యలిసేవచేయలేను నా
రేడొకరెక్కమీదకద రేయిబవల్ తినియుండగా వలెన్
వ్రాటొకఏడుగా నకట భూతలమందున గడ్పుచుంటిమో.

దైవమా వొకరైన జాలిపడి మాదరిద్రదేవతను తొలగించడం లే. బానిసత్వంలోవుండి నేటికిభారతావని స్వతంత్రురాలై స్వేచ్ఛ ననుభవిస్తూంటె మాబోటిగర్భదరిద్రులం పట్టెడన్నానికి నోచుకో లేకపోయాం. ఆనాడు యీనాడు సమస్తసుఖాలు వున్నవారికే చేకూరుతున్నై. మాజీవితాలకు కడగండ్లుగాక సుఖంకూడానా కన్నెత్తిమమ్మల్ని చూస్తారా ?

[ పంతులు డాక్టరు ప్రవేశం ]

ప:— శ్యామలా.

శ్యా:— ఆ. (తలుపుతీయును)

ప: — అమ్మాయి కెలావుంది.

శ్యా: బాధపడిబాధపడి యిప్పుడే నిద్రపోయింది.

డా:— (కుక్కిమంచంమీదనే డాక్టరు కూర్చొనును)అమ్మాయిపైనకప్పిన గుడ్డను పైకితీయి.

శ్యా:— (గుడ్డనుతీయును)

డా:— (నాడిచూచి) పంతులుగారు జ్వరమెంతకాలమునుండివుంది.

శ్యా:- పదిహేనుదినాలైంది.

డా:— ఇది డబుల్నిమోనియా, ఇంజక్షనుచేస్తా. (ఇంజక్షన్ చేయును) ఏంటీఫ్లొజిస్టిన్ డబ్బా కొనుకొచ్చి గుంతలుపెట్టు[illegible]

గుండెకుచల్లనిగాలిమాత్రం తగులనివ్వకండి, సీసా తీసుకురండి మందిస్తా దాహమంటె కాఫీగాని బార్లీగాని యివ్వండి వెళ్లొస్తా
(వెళ్లును)

ప:— శ్యామలా తినడానికితిండిలేనపుడు వైద్యుడు చెప్పినవి ఎలాకొనడం. దారేంకనపడ్డంలే అప్పులిచ్చేవారంత కంటెకనపడ్డంలే. తాకట్టుకు సరకులాలేవు కొంపా అసలేలేదు. ఏంతోచడంలే.

ఉ. అన్నములేదుపోని మరి యెక్కట బిడ్డకుగంజికాయ
మున్నదినాకడ యికను యొక్కటిలేదిక చిల్లిగవ్వయా
పన్నుడనయ్యి వేడుకొన యాదరణంబునుజూప రెవ్వరున్
ఎన్నగరాని కష్టములు ఏనెటులోర్తిక నెందుమున్గెదో.
ఈకష్టాలన్నీ భరించేకన్న అందరం వొక్కసారి ఏనదీదేవికో ఆహుతైపోతె మంచిదనిపిస్తుంది శ్యామలా.

శ్యా:— సాగరమున్నాయీదగలంగాని సంసారమీదుటకష్టం. అలానిరుత్సాహంపడతారేం. మనజీవితములో యిలాంటిఘట్టాలుఎన్ని ఎదుర్కోవడంలే ఆనాడు హరిశ్చంద్రుడు అనేక కష్టాలుపడ్డాడు. మనలాంటివాళ్లకొచ్చిందా.

ఉ. భార్యను విక్రయించెగద బాపనుయింటను దాసియయ్యె నే
కార్యమునైన చేసెదని కాటికిరేడగు వీరబాహుకున్
శౌర్యముమానుకమ్ముడయి శుంకముపుచ్చుక కాటికాపరై
భార్యను తాదిబంధువుల బాసెగదా హరిశ్చంద్రుడేభువిన్.

[ నర్సయ్య ప్రవేశం ]

న:— పంతులుగారు

ప:— ఆ. ఎవరు ?

న:— నేను నర్సయ్యనండి

ప:— ఏంనర్సయ్యా వొచ్చావ్.

న:— మా చంటిని చూస్తానన్నారు వొచ్చారు కాదే?

ప:— నర్సయ్యా మా పెద్దమ్మాయికి జబ్బుచేసింది వైద్యుని తీసుకురావ డానికి వెళ్లా సాయంకాలం తప్పకుండా వొస్తా.

న:— విరేచనాలుతగ్గి కులాసాగానే ఆడుకొంటుంది.

ప:— మంచిదినర్సయ్యా పెద్దమ్మాయికి బార్లీజావకాసి పట్టించాలి చేతి లో దమ్మిడిలేదు. అయిదురూపాయలు బదులుయిప్పించు ఎలా గో తీర్చుకుంటా.

న:— బదులెందుకులే (చెంగునున్న డబ్బువిప్పి) యివిగోతీసుకోండి అయి దురూపాయలే సాయంచేయలేనా మీదయవల్ల మాఅబ్బాయి ఎంతో పైకొచ్చాడు యీఏడు కాలేజీలో చేర్తాడు. ఆవిశ్వాసం మాకుంది అంతా మీయాశీర్వాదం.

ప:— అవును అంకినీడు సుబ్బారెడ్డి గంగరాజు మొత్తం పదిమంది నా చేతిలో తయారైనవాళ్లు కాలేజీలో చేరుతున్నారు.

న:— మీరు మాగ్రామమొచ్చాక మాపిల్లలంతా బాగుపడ్డారు. మేమెంతో అదృష్టవంతులం మీవోపిక ఓరిమే కారణం.

ప:— నర్సయ్యా ఏముంది ఎందుకు ఇర్వైదినాలు తెచ్చుకున్న జీతండబ్బు బు ఏంవిసరిపోడంలే. మీదగ్గర కూలీనాలీచేసుకునే కూలాడైన సుఖపడి యింతన్నం తింటున్నాడు నాకదిలేదు. గౌరవార్ధంగా జీవిస్తున్నాం నెలకెన్నిపస్తులో వారంరోజులైంది అన్నంతిని.

ఉ. కూనలకందజేయుటకు గూండ్లనుయుండియు మేతకోసమే కానలదిర్గి బిట్టలును కడ్పులనిండుగ బెట్టుమేతనే మానవధర్మమునుగ గలిగి పాపల బెంచగలేనివాడనే ఏనికమన్ని నెబ్రతుకు లెందుకో యనొ్నుచుంటి నీభువిన్.

న:— ఏంవిటింటున్నారు?

ప:— చోడిరొట్టె తప్పితే జొన్నగంజి.

న:— హారిహారి చంటిబిడ్డల్ని చంపేస్తున్నావయ్యా.

ప:— ఏంచేయమంటావ్ నర్సయ్యా ఎవరితో చెప్పుకుంటె ఎవరిస్తారు మా యాలనా పాలనా మా పైయధికారులే చూడనపుడు యితర్లుచూస్తారా కరువురోజులని కండ్లారచూచి జీతాలెక్కువచేస్తే మావంటివాళ్ళం బాగుపడాలిగాని చాలీచాలని జీతాల్తో ఏంచదువుచెప్పగలం.

న:— అవునవును. పంతులుగారు సాయంకాలమొకసారి మాచేలోకి రండి ధాన్యమేమన్నాయిస్తా.

ప:— దయచేసి మీపాలేరుతో పంపండి నేను వైద్యునియొద్దకు పోవాలి.

న:— పోనీలే ఆపనిచూచుకోండి తప్పక పంపిస్తా మరివెళ్ళిరానా?

( నిష్క్రమించును )

ప:— వెళ్ళిరా సామాన్యముగు కుటుంబీకుడైన నర్సయ్య మాదరిద్రాన్ని గ్రహించగలిగాడు యీమాత్రంప్రేమ మా అధికారులకేవుంటే శ్రామదేవతను యీనాటికి ఎదుర్కొనేవుండుం.

( తెరపడును )

[ శ్యామల పంతులు కస్తూరి యుందురు ]

ప:— శ్యామలా ఎలావుంది అమ్మాయికి.

శ్యా:— అలాగేవుంది మీరువెళ్ళినకార్య మేమయ్యింది.

ప:— సుబ్బన్నకుమారుడికి కలరావొచ్చింది. వాంతులు విరేచనాల్తో బాధపడుతున్నాడంటె మందిచ్చిబాగుచేశాను పాపం మనకుమల్లెనే డబ్బులేక బాధపడుతూన్నాడు ఆబాధచూడలేక పదిరూపాయలువరకు ముట్టడిగిపెట్టాను.

శ్యా:— పరమేశ్వరుడు దీనులపాలిట ఎంతదయగలవాడండి.

ప:— లేనిదే.ఎటువంటికష్టాన్ని తప్పించాడో ఆభగవానుడుచూడు.

సీ॥ నీసంకల్పము లేశమైనను లేక
కదలదుయీశ్వరా గడ్డిపోచ
నీయాజ్ఞ లేనిదే నేయాపదలు రావు
చీమైనకుట్టదు చింతరాదు
నీయానతిని లేక చేయలేరేక్రియల్
ఆకులల్లాడవు యహరినిషలు
నీ ఇచ్ఛ లేనిదే నిప్పునీరునుగాలి
చలనమొసగవు భూతలమునందు

గీ. నీదయన్ లేనిదే నొక్క నిమిషమేని
జీవకోటియుబ్రతుకదు చావురాదు
నీవెగద నిర్ణయింతువు నెమ్మి సకల
ప్రాణులకు పోషణంబును భక్తలోల.

[ మునసబు పోలీసులు ప్రవేశం ]

ము:— పంతులు.

ప:— ఎవరు ?

ము:— తలుపులుతీయి

ప:— (తలుపుతీయును) తొందరగా వొచ్చేరేం.

ము:— దావాచేశాను కోర్టువారు డిక్రీయిచ్చారు నిన్ను అరష్టుచేయడా నికొచ్చారు లేచిరా.

ప:— తప్పకుండావొస్తాను.

పో:— (అరదండాలు వేయును)

ప:— మునసబుగారు తొందరపడ్డారు పదిరోజులు కాపాడితె సగంపడ్డి అయిన తీర్చేవాడ్నే అప్పుకట్టవాశాను.

ము:— పంతులు చాలాకాలంచూశాను ఏమిలాభం లేదు ముందునడు.

శ్యా:— (మునసబుకు అడ్డువచ్చి) మునసబుగారు నాభర్తనువిడిచి నన్ను అరష్టుచేయండి నాబిడ్డలను ఆదరించేవారు లేరు. నాభర్తవుద్యోగంపోతుంది మీకుపుణ్యముంటుంది విడిచిపెట్టండి.

ము:— అలావిలువడదమ్మా అతన్నే అరష్టుచేయడానికి వారంటుయిచ్చారు కోర్టువారు.

శ్యా:— అధర్మం అన్యాయం.

ము: — ఏంవిటీఅన్యాయం,

శ్యా:— నాభర్తను అనేకవిధాలాశ్రమపెట్టించుకొని గులాముగా నౌఖరి చేయించుకొని చివరకు యీక్లిష్టపరిస్థితుల్లోకీ్రోసి ఆలిపిల్లలను వుసురుపెట్టినందుకు యీఘోరవిపత్తు ఏనాటికైన తగులకమానదు.

వ:— శ్యామలా రాజశాసనాన్ని దిక్కరించకూడదు. నర్సయ్య ధాన్యమిస్తాడు. యివిగో అయిదు రూపాయలు బిడ్డల కడుపుమంట చల్లార్చు నేనువెళ్లొస్తా అమ్మా కస్తూరి భగవంతునిపై భారం వేసివుండు వెళ్లొస్త. (ముద్దుపెట్టుకొనును)

[ అంకినీడు ప్రవేశం ]

అ:— పోలీసులు ఆపండిపంతుల్ని ఏంపంతులు నాఅప్పుమాట ఏంచెప్పకుండా పోతున్నావ్.

పో:— ఏమప్పయ్యా.

అ:— బియ్యంవాడుకున్నాడు పంతులు మాటాడవేం.

వ:— అయ్యా ఏంచేయమంటారు. బ్రతికివుంటే తప్పకతీరుస్తా లేకపోతే లేనేలేదు.

అ:— పోలీసులు మీకేసున్నా చదివించుకుంటూ మీ్వారైన చెప్పియిప్పించండి.

[ గంగులు ప్రవేశం ]

గం:— పంతులు ఎక్కడికిపోతా నాఅప్పిచ్చివెళ్లు.

పో:— ఏమిటాఅప్పు?

గం:— పంతులు చిల్లరవెచ్చాలు వాడుకున్నాడు ఎవరబ్బసొమ్ము.

ము:— తనవద్ద డబ్బులేకే అరష్టుచేయించాను.

గం:— అలాగా నాకు తెలిసిందికాదే. జైల్లోపెడితే డబ్బొచ్చేస్తాదన్న మాట పోలీసులు నాపేరుకూడచెప్పి నాకురావలసినదంతా సీదాగాయిప్పించివేయండి మీ కేమైన యివ్వవలసిందివుంటె వెంటనే యిచ్చుకుంటా.

పో:— నోరుమూయ్ నిన్నుగూడ అరష్టుచేసి తీసుకుపోతా.

గం:— అలాగైతె వొద్దుబాబు.

( తెరపడును )



# బడిపంతులు బ్రతుకు

## నాలుగవ రంగం

[ శ్యామల అనుతాపం ]

శ్యా:- దీనబాంధవుడవైన పరమాత్మా నీపరీక్ష తుదిముట్టలేదుగా బోలు. దరిద్రంతోపాటు కారాగారశిక్షకూడా లభింపజేశావు. యింకాఏమిచేయదలచావో తెలియదు. ఏమిచేసినా నీదేభారం నేను నాబిడ్డలు కండ్లుమూసుకొని ఏనూతినోగోతునోపడి జీవాలు గోల్పోవడమే శ్రేయస్కరమనితోస్తుంది. దైవమా విద్యావిహీనులై కెరడుకట్టిన జీవితాల్లో ఎక్కడో అడవిప్రాంతాల సస్యాలను పెంచుకుంటు ఆలమందలనదల్చుకొంటు అదేస్వర్గసీమనుకొనే మానవమాత్రులు మాదరిద్రాన్ని చూచి జాలిపడి శిలలవంటి హృదయాలుకరగి నీరై పారుతూంటె విద్యాప్రవీణులై రాజ్యపరిపాలనాశీలురై న్యాయాన్యాయ విచక్షణచేసే ధర్మ పరిపాలకులైనా మాదరిద్రాన్ని చూచే జాలికలిగిందికాదు.

సీ॥ విసుగొకింతయులేక విద్యదానముచేసి
పరులమేల్కోరిన పంతులకును
కసుగాయలను నెల్ల కన్నబిడ్డలకన్న
బహుప్రేమతోజూచు పంతులకును
ఎంతనేర్పినవిద్య నంతయుంటకయున్న
పటియింపజేసిన పంతులకును

మంచిచెడ్డలుజెప్పి మర్యాదగడియుంచి
పరుల సమ్మతిగుండు పంతులకును
గీ॥ కారగారంబు శిక్షయు గలిగెనేడ
ఇంతఎడబాటు గలిగెనిం కేమిసేతు
మమ్ముపోషించు వార లిమ్మహిని నెవరు
దిక్కులేకుండ పోయెనో దీనబంధు.

అబలనైన నేను యీచిన్నబిడ్డల కడుపుమంటలేమి చల్లార్చ గలను. ఏకూలిపనినన్న చేసుకొని జీవిద్దామన్నా, చిన్నతనంనుండి ఏకూలిపని చేయడం తెలియదు. నన్నెవరు కూలికిరానిస్తారు, పిల్లల నింకేంచదివిస్తా. అడవిలో బ్రతికే పక్షికైనా ఆదరణ వుందిగాని మాకదికూడ లేకుండాపోయింది. మమ్మింకెవరు కాపాడుతారు ఎవరిపంచకు చేరనిస్తారు.

మ॥ కడుపారంగను యొక్కపూటయును మే కాసింత కన్నంబునే
కుడువగ లేదయొ కాలమంతయును మే ఘోరంబుగాగడ్పు మా
కెడబాటయ్యెను యింతలో నకట మా కేదారిలేదయ్యయో
బడుగుల్ వోలెను లోకమందిపుడు దౌ ర్భాగ్యుల్ గ జీవించుటల్

క:— అబ్బబ్బా బాధ.

శ్యా:— చిట్టితల్లీ ఎలావుందమ్మా ?

క:— అమ్మా బాధనింక భరించలేనమ్మా, డాక్టరుగారు యింజక్షన్ చేసిన తరువాత బాధఎక్కువయ్యిపోయింది.

శ్యా:— యీమందుకూడ వేసుకోవమ్మా.

క:— అమ్మా యికమందువద్దే నేనిక బ్రతకను, నన్నుశ్రమపెట్టకు, నా గురించిమాత్రం విచారపడకు.

శ్యా:— కస్తూరి అలా అధైర్యపడతావే అమ్మా. దిక్కుమాలిన వారి పట్ల దేవుడులేడా తల్లీ.

క:— ఉంటె యీపాట్లెందుకమ్మా.

శ్యా:— కష్టాలన్నీ సుఖాలకే నిరుత్సాహపడకుతల్లీ.

క:— మనజన్మలో సుఖంకూడా అనుభవించడం. గర్భదరిద్రులం, పాపాత్ములం మీకడుపునపుట్టి మీకు యీకష్టాలుపెట్టికూడ మేము జీవించియుండడం చాలాపొరపాటు. మీకడుపున పుట్టకపోయిన సుఖవంతులై లోకంలో సగౌరవంగా జీవించియుందురేమో.

శ్యా:— కస్తూరిపువ్వు పుట్టిన వెంటనే వాసన వేస్తుందా. పక్వానికొచ్చిన గాని దానిపరిమిళం ప్రపంచానికివ్వదు.

క:— అమ్మా! కాళ్లుచేతులు వంకరలైపోతున్నై ఆయాసమెక్కువైపోతూంది.

శ్యా:— గంగాధరం.

గ:— అమ్మా.

శ్యా:— ఇలారా నాయనా.

గ:— ఏంఅమ్మా?

శ్యా:— తాటియాకులబుట్టలో వెల్లుల్లిపాయలున్నాయి యిటుకబెడ్డలు వేసి చితుకగొట్టుకురా.

గం:— (తొందరగా చితుకగొట్టితెచ్చి) తెచ్చానమ్మా.

శ్యా:— (కాళ్లనుపెట్టి మర్ధించును)

క:— అమ్మా ఎందుకేవ్వ్యనాపర్రియాస. నాకొరకేమిబాధపడకమ్మా.

శ్యా:— కస్తూరి అంతధైర్యంగా మాట్లాడితె నేనెలా జీవించాలమ్మా. నాగుండె చిదిలమైపోతుంది. నీవలాఅనకూడదుతల్లీ.

క:— అమ్మా నాన్నేరి.

శ్యా:— (కన్నీరుకార్చును) వొస్తారమ్మా.

క:— ఏడుస్తున్నావేం ?

శ్యా:— ఏమీలేదుతల్లీ.

క:— నిజంచెప్పవా ?

శ్యా:— బడికి వెళ్లారు.

క:— ఇప్పుడెన్నిగంటలయింది ?

శ్యా:— పండ్రెండు.

క:— మానాన్న పదిగంటలకే వొస్తారుకదమ్మా ?

శ్యా:— స్కూలులో యినస్పెక్షన్ అవుతుంది. ఆలస్యంగావొస్తారు.

క:— లేదమ్మా మొన్ననే అయిపోయింది యిన్స్పెక్షన్.

గం:— అక్కయ్యా నాన్నను పోలీసువారు తీసుకుపోయారు.

క:— (కంగారుపడి) ఆ. నాన్నా. నాన్నేంచేశారు. హా తండ్రీ (ప్రాణం విడుచును)

శ్యా:— (తలనేలకుపెట్టికొట్టుకొని) అమ్మా చిట్టితల్లీ ప్రాణాలు విడిచిపెట్టేశావా. కస్తూరి—కస్తూరి యింకెక్కడికస్తూరి. ఇప్పుడేం చెయ్యను నాన్నతో ఏంచెప్పమంటావ్ కస్తూరి. మీనాన్నకు మొగమైన చూపకుండాపోయావే, నాచిట్టితల్లి ఏదంటే బడికి వెళ్లిందనిచెప్పనా, పరమాత్మా ఎంతనిర్ధయంగా నీవద్దకుచేర్చుకున్నావ్. అమ్మా ఒకనాడైన నాచే మాటఁనిపించుకొనలేదు. నీవెంతభయభక్తులతో నడిచావోచెప్పలేను. ఎవరుకూడా నీ కుమార్తెచెడ్డదని నిందించిఎరుగరు. చూచినవారంత ఎంతసుగుణవంతురాలని నన్నెంతో కొనియాడుతూవచ్చారు. తల్లీ మీకడుపునపుట్టడం ఎంతోఅదృష్టం చేసుకొన్నారని చెబుతూంటె ఎంతగర్వపడ్డామో తల్లీ, ఆడబిడ్డవు వొకర్తవని ఎంతో ఆనందం పడ్డాం యిపుడెవ్వరిగురించి చెప్పుకోమంటావ్.

[ నర్సయ్య ప్రవేశం ]

న:— అదేమిటమ్మా అలాదుఃఖపడుతున్నావ్.

శ్యా:— నాయనా నాచిట్టితల్లి కస్తూరిని భూదేవికప్పగిస్తున్నాను.

న:— శ్రీహరి, నాన్నగారేరి ?

శ్యా:— దిక్కుమాలిన పక్షులనుచేసి వెళ్లిపోయారు.

న:— ఎక్కడికమ్మా ?

శ్యా:— మునసబుగారి దావాలో అరష్టుచేయబడ్డారు.

న:— అదెప్పుడమ్మా ?

శ్యా:— మీరువచ్చినమరునాడు.

న:— అమ్మాయి కాలంచేసి ఎంతసేపయింది ?

శ్యా:— ప్రొద్దుటెపోయింది.

న:— పంతులుగారికీవార్త తెలిసిందా ?

శ్యా:— లేదుబాబు.

న:— దహనసంస్కార ప్రయత్నమేమన్నా ఆలోచించారా ?

శ్యా:— బాబు నేనేమాలోచించగలను. అనాధులమై కడుపుమంటతో బాదపడుతూన్న సమయంలో యిట్టికష్టాన్నెదురుకోడం నాతర మవుతూందా. నాచేతిలో నొక చిల్లిగవ్వయైనాలేదు. ఎవరి నన్నా అప్పడుగుదామంటె ఆడుదానిని నాకెవరిస్తారు.

న:— పాపం. అమ్మా మీరేమివిచారపడకండి. ఆఖర్మంత నేనేభరించు కుంటా.

శ్యా:— మంచిదిబాబు. (ఏడ్చును)

న:— పిల్లలు బెంగపెట్టుకొంటారు మీరు ఏడ్వకండి. విధివ్రాత తప్పిం చగలుగుతామా తల్లీ దేవునిబిడ్డను దేవుడే తీసుకుపోయాడు. మనం ఏంచేయలేం ప్రతియింటను జరిగేదే క్రొత్తేమికాదు. సుఖందుఃఖం చీకటివెన్నెలు. కష్టసుఖాలు కావడికుండలనుకో వాలి.

( తెరవ్రాలును )

# బడిపంతులు బ్రతుకు

## ఐదవ రంగం

[ కారాగారం పంతులు అనుతాపం ]

వం:— ఎన్నికష్టాలు నన్నుచుట్టుకోవాలో అన్నికష్టాలు నన్ను ఆవరించి వున్నై. చివరకి చెరశాలప్రాప్తికూడా కలిగింది. తాగుబోతులకు, జూదరులకు, దొంగతనాలు చేయువారికి రాజశాసనాన్ని దిక్కరించువారికి చెరశాల నాబోటివిరుపేదవానికికూడ లభించింది.

ఉ. జీవితయాత్రలో ఘనులు చీకటివెన్నెలు పోల్చిచెప్పు నా
జీవితమంతయున్ కఠిక చీకటిగా నిలదోచుచున్నదే
తావెచటేమిగాన్పడదు దారియుతెన్నునులేని జీవితమ్
భారములెన్నియున్న కడుపాట్లునుదప్పగలేదె యీభువిన్.

న్యాయానికిచూస్తే మునసబుచేసిన మాయను గ్రహించలేక పోయాను. ధర్మాధర్మాన్ని ఆలోసించాడుకాదు. నేను అతన్ని మోసంచేశానే అనుకున్నాడు. కాని నేను సంపాదించిన జీతమెంతో మితవ్యయంచేసి మిగిల్చినదెంతో తెలిసికొనలేకపోయాడు.

ఉ. వేతనమందుకొన్న పది వేలుగ నాపదిరోజులెంచు మా
యాదురతేమొ చెప్పుకొన యాక్షణమే ధనవంతుండు నా
రీతిగ సంచరించెదము లేమితొ వేదనచెందుచుండి మా
వేతన మారువెన్క యిక వ్రేళ్లను లెక్కనుబెట్టుచుందుమో.

మ. పసిపాపొక్కడు బువ్వబువ్వనరచున్ మర్యొక్కడున్ పాలుకున్
విసిగించున్ మరొకండు పాత్రములకై వెర్వంగ మర్యొక్కడున్
అసలే గుడ్డలులేవు నేబరికినిం కబ్బబ్బపోలేననున్
మెసలన్ యొజ్జలకేమి తావుగలదో మేదిన్ గదా యక్కటా.

[ పోష్టుమేన్ ప్రవేశం ]

పో:– మహాత్మా పేట పంతులుగారు,

పం:– నే నే.

పో:– ఇదిగో కార్డు.

పం:– (చదువును) నీకుమార్తె కస్తూరి స్వర్గస్తురాలయ్యింది. హా! దైవమా (నేలకొరుగును) దీనరక్షకా ఎంతపనిచేశావ్. దిక్కునీవని దినదినము నీకొరకై కన్నీరుకారుస్తున్న యీదీనుని దీనాలాపము తొలగించలేకపోయావా, దవ్వంత కనికరమైన లేకపోయిందా, గాఢాంధకారములోబడి దారీతెన్నూ తెలియక కృషించి కృంగి మ్రగ్గిపోతున్న యీగర్భదరిద్రుడే దొరికాడా కష్టాలుపాలుచేయడానికి, నోరెరుగని పసిపాపను తీసుకపోవడానికి నీమనసెట్లొచ్చింది. మకరిపాల్పడిన కరితెరిచిక్కులలో బడిన నేను మొరబెట్టుకొన్నను వినవైతివిగదా.

ఉ. ఏరును లేరునాకిలను యీవెగటీయుని ఏనునమ్మి నా
భారమునీదెదేవయని బల్కగనే వినవైతివేమొ నా
నేరములెంచబోకుమని నేబ్రతిమాలు కొనంగలేక యీ
తీరుగజేసినా కొమరి దీసుకపోతివ దీనపాలకా.

దేవా నేచేసినఘోరంపాప మేమో తెలియడంలే నేనెవరికపకారం చేశానో వూహించలేకపోతున్నా, నాఅమూల్యధనరాశిని నా బంగరుకొండ కస్తూరిని క్షణబంగురంలో గోల్పోయా. నీపాదాలువిడిచి పెట్టేటప్పుడు నన్నెంతపిలిచి శుష్కించి మృత్యు

నోటబడ్డావో నాయందు నాన్నకు ఎంతదయలేకపోయెనని ఎంత నిందించావో.

సీ॥ నాన్నఏడనిచెప్పి నన్నడిగి నీవెంత
అవసానకాలమం దడలినావొ
పాడురోగముతోడ బాధనొందుచు నీవు
మందుకై నీవెంత గుండెనావొ
ఆకలిబాధకై అల్లాడిపోయి నా
న్నసమర్థుడని యంగ లార్చినావొ
ఈదరిద్రముచూచి ఎందుకీబ్రతుకని
వగచెంత ప్రాణముల్ వదలినావొ

గీ. అమ్మరో నిన్నుకనుకున్న యాశతీర
లేదుమమ్ముల విడనాడి ఏదిశకునొ
చేరిపోతివితల్లిరో చేతులార
పంపితినిగద దివికిని పట్టినిన్ను.

అమ్మా నాకునేనెంత నిందించుకుంటె ప్రయోజనమున్నది, మృత్యువాసన్నమైనప్పుడు మీాయమ్మతో నేమైనచెప్పావోలేదో తెలియదు నేనెంతదురదృష్టవంతుడను తల్లీ. నిన్నొకసారి కను లార చూచుకోడానికైన నోచుకోలేకపోయాను. నామనఃఖేద మెట్లు బాపుకోవాలో తెలియడంలే!

కై:— అబ్బబ్బా యిదేమిగోలయ్యా. మానిద్దరంతా చెరిపేస్తున్నావ్.

పం:— స్వామి నాకుమార్తెపోయిందని వుత్తరంవొచ్చింది దానిగురించి దుఃఖమాపుకోలేక విలపిస్తున్నా.

కై :— పిచ్చివాడా పోతేమాత్రం మళ్లీరాకపోతుందేమిటి ఏడ్వడమెం దుకు కంఠశోషగాని.

పం:— కాదయ్యా స్వర్గస్తురాలైయ్యింది.

కై:— అయితేమాత్రం స్వర్గస్థురాలయ్యింది మళ్లీవొస్తుందా నాపెళ్లాం పోతె నేనేమిచేశాను ఏడ్వాలన్నా ఏడ్వలేదు.

పం:— అయ్యా కనుకున్నందుకు ఆశైనతీరవద్దా.

కై:— ఆడబిడ్డ నెవరికో పెండ్లిచేసేశాననుకోవాలిగాని ఏడిస్తేమళ్లీవొస్తుం దా, మానిద్దరపాడుచేయడంగాని.

పం:— అవును నాబాధనీకుగలిగిన్నాడుగాని తెలియదు.

కై:— చాలు నోరుముయవయ్యా. నాకుమార్తెనుగూడ చావమంటు న్నావా.

పం:— అదికాదయ్యా.

కై:— అదీకాదు ఏదీకాదు నోరుమూసుకో.

పం:— నేనేదిచెప్పినా కష్టంగానేవుంది. నీతోమాట్లాడ్డమేతప్పు.

కై:— ఇది జైలనుకున్నావా. నీయిల్లనుకున్నావా.

పం:— సరిసరి బాగానేవుంది. యింకేమిమాట్లాడుకోగూడదా. ఏమిటా అధికారం.

కై:— కాకపోతే అట్టేమాటాడితే జైలరుచుపిలిచి నోరుమూయిస్తా. నేనెవరినో తెలుసా, పాతకేడీని పాతికేళ్లుసర్వీసు, జైలునూవ రెంటునుగూడ లెక్కచేయను. మనమంటె హడల్.

పం:— అందుకనే అంతధైర్యంగా మాట్లాడుతున్నావ్.

కై:— ఏమనుకున్నావ్.

పం:— వాస్తవానికంతే.

శా. రోజుల్ బాగుగలేని యప్పుడకటా లోకంబునన్ లోకులున్
నీచత్వంబుగజూచు నిందలమితన్ నెత్తిన్గదా మోపునే
పూజార్హుండని ఎల్లరొప్పుకొననీ బుద్ధేమొ గల్గుండ నీ
బూటకన్గాదొక గడ్డిపోచగనునే చుల్కన్గనే జూచునే.

దైవమూ కడకు నొకదొంగవానిచేతగూడ నిందింపబడవలసి వచ్చింది. ఏదైననోరున్నవాని దేబలం అన్నిటికిని తెగించినవాడే బలవంతుడు అట్టివారికి ప్రతివారు లొంగెవుంటారు.

ఉ. కాలముయెట్లుమారెగద కాటికిపంపితి కన్నబిడ్డనే
కూలిపనేమొచేసుకొని కూటికి బాధనుచెందునట్టి వా
రాలిని తల్లిదండ్రులను హాయిగబెంచును చుక్కటక్కటా
ఏలను యొజ్జలై బ్రతుకుటేమిటొ సార్థకమింకనీభువిన్.

ప్రపంచంలో అమాయకులననేకమందిని కండ్లు తెరిపించి, మూడవనేత్రాన్నియిచ్చి ఏనాడో నాటిన బీజము మహావృక్షమై ప్రజ్వరిల్లుతుంది. మరి విత్తనం రేణువులాంటిదైన మహావృక్షాన్నిచేస్తుంది. బడిపంతులుచదువు తక్కువైన మహామేధావిని చేస్తాడు. రాజ్యపరిపాలనాశీలురై భూమికిని ఆకాశమునకుముడి వేయుశక్తిగలవారైయుంటారు. అట్టివారినిచేసింది బడిపంతులే గదా. ప్రపంచమేలమరిచిందో తెలియదు.

ఉ. పండితుడయ్యె నావలన పావనుడయ్యెను వైద్యుడయ్యె నా
యండనుయుండి లాయరయి హాయిగనే సుఖజీవనంబుతో
యుండెనమాయకుండొకడు యొజ్జలకెల్లను యొజ్జయయ్యెనే
పండగపంచలేదకట పట్టెడు యన్నమునాకులేమికో.

సత్యసంధుడనై మాయనెరుంగక గురువే తల్లి దండ్రియు సమస్తమని పవిత్రహృదయంతో పాఠాలు బోధించి దానిలో నున్ననిగ్గు హృదయాంతరాళమున నాటించి యుద్ధరంగానికి సైనికులన్ తయారుచేసిపంపినట్లు పరీక్షలలో ఉత్తీర్ణులౌనట్లు తయారుచేసిపంపింది బడిపంతులు. అట్టిబడిపంతుల్ని మర్చిపోయారు.

ఉ. దారగపోసితిన్ వయసు ధర్మముగా పసిబిడ్డకెల్లనా
శూరతనేమొజూపితిని శుంఠలనెల్లను బాగుజేసితిన్

6

వారిమినోపికెంతగనో యిచ్చినిజూపుచు ధన్యజీవినై
హారవుబొందితిన్ కడకు నక్కట వార్ధకమందు నిప్పుడున్.

చేతిలో దమ్మిడైన లేని సమయంలో నాచిట్టితల్లి ప్రాణాలు బాసిపోయింది. దహనసంస్కార మెట్లు జరిగిందో తెలియదు. ఎవరైన పుణ్యం కట్టుకొని అడ్డుపడినారో లేదో యీ మెచావునుచూచి మగపిల్ల లేమైనారో గదా. తల్లి నెవరైనా వోదార్చారో లేదో ఆమెగుండె నిలబడియుండునని నేను మాత్రం తలంచను. కడుపార కనుకున్న కన్నబిడ్డ అకస్మాత్తుగా దివంగతురాలైనపుడు ప్రాణ మెట్లునిలుపుకోగలదు.

ఉ. దమ్మిడిచేత లేదు యిక దాసిగనే బనిచేయలేదయో
పొమ్మను కొంపనుండికను వూర్తిగయద్దిని యివ్వమన్న తా
సొమ్మును లేదు బాబుయన చూడక కొట్టును యాలిపిల్లలన్
అమ్మయి కేడబోదుమని యక్కట ఎంతగ నేడ్తురో గదా.

దీనబాంధవా నీకే దయలేనపుడు మానవమాత్రులకు దయ కలుగుతుందా. నాకుటుంబాన్ని ఏపంచకు చేర్చావో గదా. నీదయలేనిదే దిక్కుమాలినవారిని ఏపంచకు చేరనిస్తారు. స్వగ్రామమా కాదు అన్నదమ్ములా లేరు. అక్కచెల్లెండ్రా అంతకంటె లేరు. తల్లిదండ్రి నాచిన్నతనాన్నే గతించారు. బడిపంతులు బ్రతుకు యిలాగే వుంటుంది.

చ. గడచెను రెండుమాసములు కాలముయింకను ఎన్నినాళ్లు తా
గడుపును నాకుబత్యమిక కష్టముతోచక మానునేమి గా
నిదుములుబొందగా వలసె నిప్పుడు ఏమియుతోచదక్కటా
జడమతినైతినంచును ని జానికి నేబుణమివ్వలేక నే.

( తె ర ప డు ను )

# బడిపంతులు బ్రతుకు

## ఆరవరంగం

[ మతిపోయిన శ్యామల ]

శ్యా:— కస్తూరి—కస్తూరి, అదిగో మాకస్తూరి వొస్తుంది. అమ్మా పంతులు గారు పాఠాలు ఎక్కువ చెప్పేరేమిటమ్మా యింత ఆలస్యమైంది మాట్లాడవేం కోపమొచ్చిందా. రా అన్నం పెడతాను, మీనాన్న వొచ్చే వేళైంది మీనాన్నను తీసుకురావడానికి పోయావా. నాన్నొస్తున్నారా చిన్న తమ్ముడు అన్నానికేడుస్తున్నాడు కస్తూరి అన్నం పెట్టు, కాసింత రొట్టెముక్కన్నా పెట్టవమ్మా చిట్టినా వొద్దకురావేం కోపమొచ్చిందా. మీనాన్న నీకు మంచిబట్టలు కొనుకొస్తానని బజారుకుపోయారు నిజమేనమ్మా. అదేమిటమ్మా యింతఆలస్యంగా వొచ్చావ్ ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు. నీవెంతత్వరగా క్లాసులు ప్యాసయిపోయావమ్మా.

( నర్సయ్య ప్రవేశం )

న:— శ్యామలాదేవి శ్యామలాదేవి. నేను నర్సయ్యను జ్ఞాపకంరాలే.

శ్యా:— అహా హ అహహాహా నర్సయ్యగారా ఓహో మాకస్తూరిని చూడ్డానికొచ్చారా, లేదు బడికిపోయింది, మీరిచ్చిన చోడి కట్టేవుంది, సరిపోతాదిలే స్వతంత్రంవొచ్చాకయినా ఆడదానికి మగవానికి స్వేచ్ఛవుండితీరాలి.

న:— పాపం కస్తూరి పోయినప్పటినుండి శాబోలు మతితప్పిపోయింది. ఏంమాట్లాడిన వినిపించుకోవడం లేదు. అవును ఎవరి ప్రారంభరి

స్తుందిలే భర్త జైలుకుపోయాడు పెండ్లియీడువచ్చినపిల్లా గుండె దెబ్బకు కుల్లై ఎగిరిపోయింది. తినడానికితిండిలేదు తలదాచుకోడానికా కొంప లేదు. యిన్నీచూస్తే మతిపోకపోతే ఎలావుంటుంది. పాపం యిప్పుడెవరాదరిస్తారు. బంధువర్గమూ లేదు చేతిలో డబ్బాఉన్న యిం యిల్లా ఖాళీచేయమంటారు. వొక్కొక్కసారి వొక్కొకకుటుంభానికి యిలాంటి అవాంతరాలే వొస్తూవుంటాయి. కుటుంభనాశనమంటారు యిలాంటిదే యీపిల్ల లేమైపోయారో పాపం.

[ జగన్నాథం, గంగాధరం ప్రవేశం ]

గం:— బాబు ఎక్కడికిపోయారు.

జ:— బడికివెళ్లామండి.

గం:— వొంటచేసుకున్నారా.

జ:— బియ్యంలేక వంటచేసుకోలేదండీ.

గం:— పాపం మీఅమ్మాగారికి మతెవ్వడుపోయింది.

జ:— మాఅక్కయ్య చనిపోయినమరునాడే మతిపోయింది.

గం:— శ్రీహరి దిక్కు మాలినబ్రతుకంటెయిదె అబద్ధమాడలేకగదా హరిశ్చంద్రుడు భార్యాబిడ్డల్ని అమ్ముకొని తానుకూడ అమ్ముడుపడినాడు. పంతులుగారుకూడ అబద్ధమాడలేక ఋణంతీర్చలేక కారాగారశిక్ష అనుభవిస్తూ భార్యాబిడ్డల్ని కష్టాలుపాలుచేశాడు.

శ్యా:— కస్తూరి–కస్తూరి వొకసారిమాట్లాడవమ్మా నీకునేను ఏంద్రోహం చేశానుతల్లీ నాన్నగారు కోపడ్డారా. డాక్టరుగారు వొస్తున్నారు కొంచంవోపికపట్టమ్మా జావత్రాగుతల్లీ బాగానేవుంటుంది. పంచదారలేదమ్మా వుప్పువేశాను పుల్లలులేవండీ జావకాచు

డానికి. పోలీసువారా, నాభర్తనువిడిచిపెట్టి నన్నుతీసుకుపోండి జగన్నాథం రెట్టకాలుస్తా తినిబడికివెళ్లు నాయనా.

[ బూదెయ్య పరివేశం ]

బూ:— ఏవమ్మా పంతులుగారేడీ, యిల్లుఖాళీచేయండి, వొకరోజా రెండురోజులా ఆరుమాసాలఅద్దె యివ్వలేదు.

శ్యా:— అటుకుమీదపెట్టానండి, నర్సయ్యగారిచ్చిన చోడికట్ట రాత్రింతా నిద్రలేక నలిపినంచలేకపోయాను (అనుకుంటూ లోపలకు వెళ్లును)

న:— బూదెయ్యా మతిపోయినమనిషిని ఏమడుగుతావయ్యా.

బూ:— పంతులుగారేడి.

న:— తెలియదేంవిటి మునసబు ధర్మసూ అంటూ చెరశాల ప్రాప్తయ్యాడు.

బూ:— కారణం ?

న:— కారణానికేముంది. పంతులుగారు ఆరువందలరూపాయలు బాకీ అంట ఋణంతీర్చలేదని అరష్టుచేయించాడు.

బూ:— మునసబు పిల్లికిబిక్షంపెట్టడుగదా ఆరువొందలుఋణం యిచ్చాడా అతనెలాగిచ్చాడు, నీవెలానమ్మావ్.

న:— దొంగపద్దులువ్రాసి ఋణంపెంచాడు.

బూ:— పంతులుగారు తెలివైనవారే దొంగపద్దుమీద సంతకమెలాపెట్టాడు నర్సయ్యా.

న:— మనగ్రామమూ ఏమన్నానా. గ్రామాధికారి కూర్చోమంటే కూర్చోవాలి, నిలబడమంటె నిలబడాలి. లేకపోతే వుద్యోగంవూడబెరికిస్తాడేమో అనిభయం.

బూ:— అసలెంత, వడ్డీఎంత.

న:— అసలు నూటఏభై, వొడ్డీనాలుగొందలయాభై.

బూ:— అదేం వొడ్డీ.

న:— జబరదస్తీవొడ్డీ.

బూ:— నగ్సయ్యా మునసబుసంగతి ఎవరెవరుగం. అంతడబ్బు పంతులు కెలా యిచ్చాడనుకుంటాం. పదిరూపాయలప్పిచ్చాడంటే పది మందిజామీను కావాలి. అలాంటిపీనాసి మన గ్రామంమొత్తం మీదలేదు. పంతులునాకు ఆరుమాసాలఅద్దె యివ్వాలి. పోనీ పిల్లలగలవాడేమిస్తాడని అడగటమే మానుకున్నా ఏంచేస్తాం.

న:— ఆవొళ్ళకష్టమేకాదు పెండ్లీడువొచ్చిన పెద్దకుమార్తె మొన్ననే కాలంచేసింది.

బూ:— శ్రీహరి పెద్దమ్మాయే?

న:— అవును.

బూ:— చాలా బాగుండేదిసుమ్మా ఆపైగా లక్షణాలూమంచివి.

న:— చచ్చినవాళ్లకళ్లు చేరడేసి ఏమిలాభం.

బూ:— ఏంజబ్బూ?

న:— సన్నిపాతజ్వరం రెండురోజులుజర్వం మూడవనాడు మరణం.

బూ:— ఆపైగా తండ్రిమీదబెంగ.

న:— కాటకమొచ్చిపడిందికదు. యీమధ్య కూటికిగుడ్డకు చాలాహీనులైపోయారు. మూడురోజుల కొకపర్యాయం గంజికాచుకునే వారు. తిండిలేకపోతే ఎటువంటివారైన బెంగపడిపోతారు అదే గొప్పబెంగ.

బూ:— ఇలాగే దరిద్రంతో కొన్నికుటుంబాలు నశించిపోవడం వీళ్లకుబంధువులెవరులేరా.

న:— పాపమెవరులేరు. పంతులు తనభార్యా ముగ్గురుపిల్లలు.

బూ:— ఇతన్దేవూరు.

న:— ఏమో నాకు తెలియదు. ఆసంగతెప్పుడు అడగ లేదు గాని తెలివైనవాడు. యితడు మనవూరొచ్చిన తరువాత చాలామంది పిల్లల్ని తయారుచేశాడు. అర్జీవ్రాసాడా మళ్లాతిరుగులేదు. ఏదైన గొప్పపదవిలోనుండవలసినవాడు ఖర్మంగాలి పంతులువృత్తిలో పడ్డాడు.

బూ:— అవునవును నాకు తెలిసింది. చాలామందికి అనేకవిధాలా ఉపకారంచేశాడు.

న:— ఎందుకునామట్టుకునాకు ఎన్నో పర్యాయాలు తోడ్పడ్డాడు యీతని ముందు ప్లీడర్లుకూడ పన్చేయలేరుగా.

బూ:— ఇంత తెలివైనవాడు అప్పులోనుండి తేల్లేకపోయాడేం?

న:— అందిలోనేవుంది గొప్పతనం. యితడు వొకర్ని మాయచేసి డబ్బు సంపాదించడం చేతరాదు. తనహృదయం అలావొప్పుకోదు. తెలిసియిస్తే పుచ్చుకుంటాడు. లేకపోతె వూరికే ఉపకారంచేసి పొమ్మంటాడు.

బూ:— మునసబు యిదేకాదు అనేకమైన అక్రమాలు చేస్తున్నాడు. ఎప్పాటో ఒకప్పుడు పోతాడులే, నాలుగువొందలఎకరాలభూమి స్వంతభూమికిమల్లేనే వాడుకుంటున్నాడు ఎవరడుగుతారు.

న:— అదెలావాడుకుంటున్నాడు బూదెయ్యా.

బూ:— తనవద్దనున్న పాలేళ్లచేత చేవ్రాళ్లుచేయించి ధరఖాస్తులమీద భూములిప్పించాడు. వారిపేరుమీదనే పన్నులు కట్టేస్తాడు. భూమంతా పండించేసుకుంటాడు. పేరుపాలేళ్లది ఫలితంమునసబుది. ఎలాపాడుచేసినా పేదవాళ్లనేగా.

న:— మనమెందుకూరుకోవాలి.

బూ:— గ్రామాధికారి యికవిరోధపడాలి, మనకేనష్టం. చదువుసంధ్య లేని మోటువాళ్లం పన్నులివ్వలేదని పద్దులోవ్రాసేస్తాడు. పట్టా

లా క్షుంటూరు. సర్కారువారు అందుకేఅతన్తోవిరోధపడరు. ఆపైగ
తోంటరిచాదుకొాబు కర్ణంవాడుదేవాంతకుడు వీడు నరాంతకుడు
ఇద్దరికిద్దరు తోడుదొంగలు. వీడికి నాలుగొందలెకరాలేగాని
వాడికి పాతికెకరాలెచ్చున్నాయి.

న:— ఎప్పుడో యీపాపం బ్రిద్దలౌతుందిలే.

బూ:— పూరికేపోతుందా.

న:— ఏదెలాగున్న పూర్తిగా పంతులుకుటుంబాన్ని నాశనంచేశాడు.
యీపాపం ఏనాటికైన తగలకమానదనుకో.

బూ:— తరువాతమాట ముందుపంతులునాశనమైపోయాడుగా,

న:— నాశనమైపోయాడంటె పంతులకు గుండెధైర్యంక లేపోయింది. మరొ
కడైనట్టయితే పంతులుకంటెముందు మునసబె అరష్టుకావలసిన
వాడు.

బూ:— అవునవును నన్నివిధంగా వుపయోగించుకొంటున్నాడు. మున
సబుచేయనంటె జబరదస్తీచేస్తున్నాడని మనబోటువాళ్ళను సాక్షు
మేసి ప్రిభుత్వానికి తెలియపరిస్తె తనసంగతేమో తెలిసిపోయే
వుండును.

న:— బడిపంతులసంగతి ప్రిపంచంలో ఎవరిగ్గావాలి. బడిపంతులుబాధ
లు ప్రిభుత్వంవారుతీర్చిన్నాడు యీపంతులుకుటుంబం ఎందుకు
నాశనంఅయివుంటుంది. అవునుగాని ఉపాధ్యాయుని జీతమెంత.

బూ:— ఎంతో నా పాతికరూపాయలు.

న:— గస్తీతిరిగే తలారివానికున్న జీతమున్నాలేదే. అయితే యితనికంటె
మనదగ్గరున్న పాలేరువానిపనేమెరుగు.

బూ:— తలారివాడెంతో, జ్ఞానోదయంచేసే పంతులుఅంతే మనవారి
దృష్టిలో.

న:— బ్రితుకులేక నేనుమీా యీబడిబంతులుచేయడం,

బూ:— బ్రతుకు తాకే బడిపంతులు చేస్తే గత్యంతరం లేదని పాతికరూపా యలు జీతమిస్తారు. అడిగితే అంత హెచ్చుజీతమివ్వడమే కష్ట మంటారు

న:— కష్టపడి ఎనిమిదిగంటలు పనిచేస్తే యింతఅన్యాయమైనజీతమా.

బూ:— గౌరవమైన వుద్యోగస్తులలో తక్కువజీతం బడిపంతులదే, జీతాలు పెంచాలని పార్లమెంటులో బల్లగుద్ది యితర వుద్యోగస్తులగురిం చి వాదిస్తారు. వీరిగురించి వాదించేవారెవరు. వీరసంగతి ఎవరి గ్గావాలి.

న:— సరే ఏదిఎలాగున్నా పంతులుపిల్లకాయల్ని ఏదోవిధంగా కొంచం కని పెట్టడంఅవసరం.

బూ:— తప్పకుండాను రేపుమనబిడ్డలగతెవరు తెలుసుకున్నారు. మనం కొంతఆదరించకపోతే వారిచదువంతా నాశనమైపోతుంది.

న:— బూదెయ్య మనం యిలా చూస్తువూరుకుంటె కాదు నీవెళ్లి డాక్టరు గారికీవిషయమంతా చెప్పి అతన్ని తీసుకురావాలి. యీామెబాగు పడేవరకు మనడబ్బెంతైన ఖర్చుపెట్టాలి.

బూ:— బాగుపడుతుందంటావా!

న:— బాగుపడకేం వొక్కయింజక్షన్‌తో పిచ్చొగిచ్చి ఎగిరిపోతుంది.

బూ:— అయితే నేనువెళ్లోస్తా కొంచంజాగ్రత్తగాచూడు.

న:— అలాగే. (నిష్క్రమించును)

శ్యా:— (మరలవచ్చింది), హ. హ. హ. నర్సయ్య కస్తూరిని తెస్తాడు. భూదేవి నీవే నాకస్తూరినిదాచావు తీసుకురా ఎవరబ్బసొమ్మను కొన్నావ్. నాకడుపార కనుకున్నా ననుకున్నావా వూరికేదొరికిం దన్నానుకున్నావా. దావాచేసైన కస్తూరిని రప్పిస్తా తీసుకురండి ఎక్కడదాచారో (అరచి అరచి నేలపడియుండును)

న:— పూర్తిగామతిపోయింది. డాక్టరుగారైన బాగుచేస్తారోలేదో యీపిల్లలేమైపొతారోపాపం, యీచిన్నతనంలోనే తల్లిదండ్రికి దూరమైపోయారు. యీవార్తవిని పంతులుమాత్రం బ్రతికుంటాడా గుటుక్కున ప్రాణంవొదిలేస్తాడు.

( బూచెయ్య.డాక్టరు ప్రవేశం )

డా:— (శ్యామనుచూచి) ఎంతసేపైంది పండుకొని.

న:— అరగంటైందండి.

డా:— (నాడిచూచి) ఏమని కేకలువేసింది.

న:— కస్తూరికస్తూరి రాఅమ్మాఅన్నంపెడతానుఅని పరద్యానంగా కేకలు వేసేది.

డా:— (ఇంజక్షన్ చేయును) లేచినతరువాత కాఫీపట్టించండి.

న:— ఏమైనాబాగుపడుతుందండి.

డా:— ఏమీభయంలేదు. మందిస్తా తీసుకురండి.

బూ:— నేనేవొస్తానండి. నర్సయ్యా జాగ్రత్తగావుండు.

న:— అలాగే.

( తెర పడును )



# బడిపంతులు బ్రతుకు

## ఏడవరంగం

[ శ్యామల కాఫీహోటల్ ]

శ్యా:- ఆహా భగవానుడా ఆఖరికి కాఫీహోటల్ లో కూలికిపప్పురుబ్బు కొని జీవించుకాలం ప్రాప్తింపజేశావుగద యీహోటల్ మేనేజ రుపుణ్యమా అంటూ వొకరాత్రింత పప్పురుబ్బిన వొకరూపాయి చేతిలోపెడుతున్నాడు. యిదికూడ లేకపోయేటట్లైతే నాబిడ్డ లగతేమైపోవునోగదా. (చెమటలు:కారును) అబ్బా ఎంతకుతరు గటలేదు. యీపప్పుతెల్లవారకముందె అప్పగించాలి హోట లుమేనేజరువచ్చి ఏమంటాడో.

సీ. పేదరికముతోడ బాధజెందినగాని
ఎండవట్టిదోగూడ నెనుగనేను
కూటికి గుడ్డకు మాడిచచ్చినగాని
కూలిపనికిపోవ జాలనైతి
ఏన్నిఅవాంతరాల్ ఎలమ పుట్టుకొనిన
బోనిసైరేయింట బ్రతుకునైతి
మూడునాళ్లనురెట్టె ముక్కలుతినినను
బక్కచిక్కినగోడ్ల వలెను యుంటి

గీ. గాని నేటికి బానిస గానుయుండి
ఇడ్లికై పప్పురుబ్బినే నిచ్చినంత

ఉదయమున నొక్కరూకయు నొసగుసెట్టి
కాలమును గడుపుకొనుచుంటి కష్టపడుచు.

దిక్కుమాలినవారికి దేవుడేదిక్కన్నట్టు నాచంటిబిడ్డలను పోషించుకోడానికి నాకిదొక మార్గమునుచూపించాడు. అవును నారువేసినవాడు నీరుపోయక మానడన్నట్టు, పుట్టించినవాడు పోషించకమానునా! గాని యొకదానికిమాత్రం చింతిస్తున్నాను. గౌరవంగాజీవించి తుదకొకయింటను దాసిగా కూలిచేసుకొని జీవించు కాలమాసన్నమైందని చింతయొక్కటే యీఉపాధ్యాయజీవితానికి ప్రవేశించింది మొదలు అంత్యమయ్యేవరకు వొకటే కష్టం, తనజీవితంలో ఏనాడైన సుఖమున్నదాఅంటె గురుకల్ల చచ్చేవేళకు దీపానికిచమురుకూడవుండదు. ఆనాడుగూడ ఎవరినో ముష్టడిగి పెట్టవలసిందే తలదగ్గర. యింతపాడుజీవితం లోకంలో నొకఉపాధ్యాయుని జీవితమే. దుర్భరం తనయొక్క లేమే దీనత్వానికి దారిచూపిస్తుంది.

ఉ. కానినిరాశగాను తన కాలమునంతయు నెంచునొజ్జయే
తానొకదమ్మిడేనియును తప్పుగకర్చును చేయనెగ్గడే
గా నెపుడప్పులే సుఖము గన్పడదే తనజీవితంబులో
మానసచింతజెందుచునె బాధలజెందుచునుండు నెప్పుడున్.

పుట్టిపదిహేనవఏటవరకో విద్యనభ్యసించు రోజులలోనో సుఖపడియుండవచ్చునుగాని ఉపాధ్యాయనివృత్తి నవలంభించిన తదుపరి ఎన్నికష్టాలకులోనై ఎన్నిఋణాల్తో తనజీవితమునిగివుంటుందో చెప్పలేను చివరకు.

ఉ. పాపము వంతులే సతికి బారెడుగుడ్డను బెట్టలేడు తా
లోభము కాదుకాదు తమ రోజులుమంచివి లేక కాదు వా

ర్భాపినచూ పులే ప్రభులు చూడక కారణమంతెగాని వా
రోక్కపమ దేమిరో తెలియ గుర్వను గుర్తునులేదె యీభువిన్.

ఉ. మామయునత్త పెండ్లికిని మంగళసూత్రము గట్టినాను ఆ
హోమముతక్క నామెడను హెచ్చుగ నల్లటిపూసలేదు మా
లేమికి కారణంబు గన లేను ప్రభుత్వము యించుకంత తా
నీమము తప్పకేను తన నిష్కళభావములెల్ల నేర్పునే!

వీరు పాండిత్యమున గొప్పవారుకావచ్చు, సకలవిద్యలయం దును ఆరితేరి. నిపుణులుఅవ్వనీ. అయితే పేదరికమే పుట్టిల్లు. వొకబడిపంతునిభార్యనై పదుగురికి విద్యాదానముచేసిన ఉపాధ్యాయునియిల్లాలినై తుదకు నొకకాఫీహోటల్లో కూలిపనిచేసు కునే దిక్కుమాలిన బ్రదుకు ప్రాప్తించిందిగదా. ఇది గ్రహచారమా లేక పూర్వజన్మ సుకృతమా. ఏమనుకోవాలో నాకే అర్థమగుటలేదు.

[ వీరయ్యశెట్టి హోటల్ మేనేజరు ప్రవేశం ]

వీ:— ఏంవమ్మా యింతఆలస్యంగా బుబ్బుతున్నావ్ చాలు చాలు మంచిపనిచేశావ్. ఏదో పేదరాలివిగదా అని కూలినప్పగిస్తే విచారిస్తూకూర్చున్నావా. యిది హోటలనుకున్నావా లేక ఏడ్వడానికి శ్మశానవాటికనుకున్నావా. మంచిమర్యాదలేదటమ్మా.

శ్యా:— అయ్యా క్షమించండి. వారంరోజులనుండి అలవాటులేనివిూందట పప్పుబుబ్బడం కొత్తచేసి నిద్రఆపుకోడం కొంతనీరసంగావుండి అలాగెమరచి కునికిపాట్లుపడ్డాను కొంచమాలస్యమైంది.

వీ:— నీకునీరసంగావుంటె కాఫీత్రాగడానికొచ్చేవాళ్లకుకూడా నీరసంగా వుంటుందటమ్మా నాహోటలంతా పాడుచేయడానికొచ్చినట్లు కనిపిస్తుంది. రేపటినుండి కూలికిరాకు మరొకరిని ఏర్పాటుచేసు కుంట.

శ్యా:— మేనేజరుగారు మిమ్ములను పాడుచేయడానికి ఆలస్యంచేయలేదు. ఎదిగిన పదహారేండ్లబిడ్డ ఆకస్మికంగా మరణించినందువల్ల నామనసు స్థిమితంలేక స్పృహతప్పియుండుటచే ఆలస్యమైంది క్షమించండి.

వీ:— నీబిడ్డపోయి ఎన్నాళ్లయింది.

శ్యా:— బాబు వారందినాలైంది.

వీ:— నీభర్తేమయిపోయాడు.

శ్యా:— చెరశాలలో బందింపబడివున్నారు.

వీ:— ఎందుకోసం.

శ్యా:— మునసబుఋణం తీర్చలేకపోవడంవల్ల.

వీ:— నీభర్తకేముద్యోగం.

శ్యా:— ఉపాధ్యాయులు.

వీ:— అయ్యోయో గురువుగారే. జైలుపడ్డారా?

శ్యా:— గురువైతేంబాబు చేతిలోదమ్మిడీలేనపుడు లోకంలో డబ్బున్నవారే చలామణవుతారు. డబ్బులేనివారు జీవశ్చవాలతో సమానం.

వీ:— అవునమ్మా డబ్బున్నవారికే గౌరవం పలుకుబడి. డబ్బులేనివారంతచచ్చినా బ్రతికినావొకటే. అయితేను యింకెవరన్నావున్నారా నీకు.

శ్యా:— ఇద్దరు మగపిల్లలుకూడావున్నారు. వారికొరకే యీపాట్లు.

వీ:— పాపం దిక్కుమాలినవారిబ్రతుకంటె యిలాగేవుంటుంది. అయితే నీపేరేమిటమ్మా?

శ్యా:— శ్యామల.

వీ:— శ్యామలా చక్కనిఉపాయమొకటి చెబుతానువిను. నీవు నీపిల్లలు బాగుపడతారు. మీకష్టాలన్నీ తొలగిపోతై నీకాకొంపలేదు,

బంధువులు లేరు. నీవు ఎక్కడో వుండడమెందుకు నీ చంటిబిడ్డలను తెచ్చుకొని యీ హోటల్లోనే హాయిగా వుండిపో. నీకు కావలసిన వన్నీ యిస్తా.

శ్యా:— అయ్యా నాభర్త రేపో మాపో వొచ్చేస్తారు, మా కష్టాలుకొంచెం నివారణ కాగలవ్. నాకీ ఆదరణ చూపారు అంతేచాలు మీకు నా ధన్యవాదాలు.

వీ:— పిచ్చిదానా నీవు బాగుపడ్డానికి యిష్టం లేదు. యిక్కడుంటె నిన్ను నీ పిల్లల్ని పోషిస్తాను. నా మాటవిను.

శ్యా:— అయ్యా మీరు కేవలం దురుద్దేశంతో మాట్లాడుతున్నారు.

వీ:— దురుద్దేశానికేముంది నీకెవరుదిక్కు లేరు గనుక నా యింటిలో వుండి పొమ్మంటున్నా.

శ్యా:— దుర్మార్గుడా తప్పు ఒప్పు తెలియక పొగరెత్తి మాటాడుతున్నావ్. యికనైన నోటికి బుద్ధిచెప్పుకో ధనగర్వాన్ని వొళ్లు తెలియక మదోన్మత్తుడవై కండ్లుగానక పేలుతున్నావ్. నీ యింటకు కూలికి వచ్చినంత మాత్రాన పొగరెత్తి మాటాడుతున్నావ్. ఇకనైన నోరుమూసుకొని వూరుకో లేకున్న తగినబుద్ధి చెప్పిపోతాను.

వీ:— తెలివతక్కువదానా మగవానికి ఆడుదిబుద్ధి చెప్పడం ఏ యుగంలో కూడా లేదు. ఎక్కడుండి మాట్లాడుతున్నావో గుర్తించుకోడం లేవొక్కసారి జ్ఞప్తికి తెచ్చుకో.

శ్యా:— ఈమాత్రందానికి జ్ఞప్తికి తెచ్చుకోనక్కరలేదు. నీ యింటనుండే మాట్లాడుతున్నాను. అయితే ?

వీ:— నా సొత్తువని గుర్తించుకోమంటున్నా తెలిసిందా ?

శ్యా:— బలాత్కరిస్తావా ?

వీ:— అవును.

శ్యా:— నీతరంకాదు.

వీ:— నీబావెవడు అడ్డంరాలేదు.

శ్యా:— దేవుడు లేడా ?

వీ:— దేవునికి యిదేపననుకున్నావా ?

శ్యా:— అవును నీవంటిపాపాత్ములకు బుద్ధిచెప్పడం దేవునిదేపని.

వీ:— పొరబాటు భగవంతునేర్పాటుకు పాపమోపుణ్యమో ఆభగవంతునికి తెలియదా మర్చిపోయినిన్ను కావాడుతాడా ?

శ్యా: నీకు మానవత్వంలేదా ?

వీ:— లేనివారెవరంటూ.

శ్యా:— నీలోమాత్రం లేదంటాను.

వీ:— లేకేం చెడుపరివర్తనుంటేగా మానవత్వంలేకపోవడం.

శ్యా:— ఇది చెడుప్రవర్తనకాదా ?

వీ:— కాదుకాదు యిది ప్రేమ.

శ్యా:— పరభామలమీదా నీప్రేమ!

వీ:— ప్రేమకుమంచేమిటి చెడ్డేమిటి ప్రేమకుగ్రుడ్డిదన్నారు పెద్దలు.

శ్యా:— నీభార్యను మరొకరు బలత్కరిస్తే నీవూరుకుంటావా ?

వీ:— భార్యావుంటేగా వూరుకునేది వూరుకోపోయేది.

శ్యా:— బాగుపడేరోజులు లేవయ్యానీకు.

వీ:— నీకులేకే నన్నుతృణీకరిస్తున్నావ్.

శ్యా:— ఇకనోరుమూసుకొని నాకూలితె వెళ్లిపోతాను.

వీ:— నీకూలీయివ్వను నిన్ను వెళ్లానివ్వను.

శ్యా:— నీవెవరవు పోనీయపోవడానికి ?

వీ:— నేనెవరినో నీకే తెలుసు.

శ్యా:— కాఫీనీళ్లుకాసుకొని పదిమందికమ్ముకొని పొట్టపోషించుకొను ఛొకమోటుమనిషివి.

పీ:— అదా నీవుద్దేశం నేను చదువుకొన్నానుగా చిన్నతనాన్ని మూడవ తరగతివరకు. యిప్పుడు కొంచంమర్చిపోయానులే అయితేనో అక్షరాలన్నీ జ్ఞాపకమే.

శ్యా:— మానవజన్మమెత్తినందుకు యిదా నీవుచేసేపని. పాపభీతిలేకుండ మాటాడుతున్నావ్. నీవుచేసే ఘోరకృత్యం పశువునకుచెల్లిందిగాని మనుషజన్మమెత్తిన నీకుచెల్లదు. ఆడుదినన్నేంచేయగలదని మిడిసిపడుతున్నా యికనైన నోరుమూసుకో.

వీ:— ఎవరునోరుమూసుకొనేది కాసేపటిలో తెలుసుకుంటావ్.

శ్యా:- ఏంచేయగలవ్ (వెళ్లబోవుచు)

వీ;- (అడ్డగించి) పోవడానికి వీల్లేదు.

శ్యా;- (దవడపై గట్టిగావేసి తప్పించుకొని పారిపోవుచు)

వీ:— శ్యామలా ఎంతపనిచేశావ్. యింతధైర్యంచూపిస్తావని కలలోనైనా అనుకోలేదు. తప్పకనన్ను ప్రేమిస్తావనుకున్నా ఎంతైనానమ్మాను. ఆబ్బా నీహస్తం నాదవడమీాదవడినపుడు నామనసెంతఆనందంపొందిందో చెప్పలేను. నీఅమాయకత్వాన్నిబట్టి నీవునన్ను తప్పకచేపడతావనినమ్మాను, యీాపదిదినాలు అలా నటించావ్కూడా, నివుసుకప్పినవిప్పులాగ యింతధైర్యసాహసాలు నీహృదయంలో దాగివున్నాయని ఎన్నడు అనుకోలేదు. గాని నాకెవ్వరులేరుగదా నిన్నునాయింటిలో పెట్టుకుందామని ఆశించా. నాకుతగిన ప్రాయశ్చిత్తమేచేశావ్ ఎప్పుడు చేయకుండా.

( తెర పడును )

[ శ్యామల, బూదెయ్య, నర్సయ్య, జగన్నాథం, గంగాధరం ]

శ్యా:— అమ్మయ్యా బ్రతుకుజీవుడాఅని బయటపడ్డాను. ఆపాపిష్టిముం డాకొడుకు కూలిపనచేయించుకొని నన్ను చెరచడానికెన్ని ప్రయత్నాలన్నా చేశాడు. యిటువంటి పాపభీతిలేని దుర్మార్గులుంటారని యిప్పటికి నాకు తెలిసివచ్చింది. ఆకూలిపనియైనచేసి బిడ్డలను పోషించుకుందామా అంటె అదికూడా శూన్యమైపోయింది. బ్రతుకు తెరువు కన్పించడంఎట్లో తెలియకుండావుంది.

సీ॥ కూలిపనినిచేసి కొమరులన్ బెంచగా
వేసారినను యది విఫలమయ్యె
ఎదిగిన బిడ్డల కింత కడుపుసిండ
కూడు పెట్టకయున్న కూలిపోవు
తల్లిబాధ్యతమీద తనయులకు పీడితకు
తండ్రిధైర్యముతోడ దానుయుండె
గంజికిపిల్లలు గజగజలాడుచు
అమ్మ అన్నముబెట్టు మనుచుండె

గీ. ఏమిచేయుదు నాకిక నేదిదారి
ముగ్గురము నీటనొకసారి మునిగిపోవ
మార్గ మొక్కటి తక్కమా మదికిసుఖము
లేదులేదింక దైవమా యీదరితి).

వయసువచ్చిన చిట్టితల్లిని అమాంతంగా తీసుకుపోయావా. భగవానుడా యీమొండిజీవాల్తో నన్నుజీవింపజేసేకంటె ఆమె కంటెముందు నన్నే తీసుకుపోలేకపోయావాతండ్రీ నిన్ననుకున్నా లాభంలేదు. మేంచేసుకున్న ఖర్మఫలితంగాని వేరొకటికాదు. కస్తూరి నన్నంతమోసంచేశావమ్మా కస్తూరి నీకుమల్లేనే వుం

టుందని పదుగురన్నందుకైన నాపేరునిల్పడానికి వున్నావుకాదు.

( మతిపోయి వూరుకొనును )

[ నర్సయ్య, బూదెయ్య ప్రవేశం ]

న:— బూదెయ్యా యీఅమ్మకు మళ్లామతిపోయిందనుకున్నా.

బూ:— పిచ్చెక్కకే పోవాలిగాని ఎక్కిందంటె అమావాస్యకు పున్నానికి ఇలాగ చూపిస్తుంటుంది

న:— అమావాశ్యాకాదు. పున్నముకాదు. మళ్లాసంకురోవచ్చింది.

బూ:— నీకుమాబాగా తెలుసు అమావాస్య యీవేళతగులు రేపుమిగులు.

న:— అదాసంగతి. అయితె పిల్లలేరి.

బూ:— బడికిపోయారుకాబోలు.

[ జగన్నాథం, గంగాధరం ప్రవేశం ]

న:— జగన్నాథం మీఅమ్మకు మళ్లాజబ్బుచేసిందా

జ:— నర్సయ్యగారు మేంబడికిపోయి యిప్పుడేవొస్తున్నాం.

బూ:— నర్సయ్యా మనం ఎంతమందిమందు ఇప్పించినా ఆ అమ్మాయి మీద బెంగేలాపోతుంది. మందు జబ్బుపోగొడుతుంది కాని బెంగనుపోగొడుతుందా.

న:— ఎదిగినపిల్ల, బాగాచదువుకుంది. లక్షణంగలపిల్ల. చేరడునేత్రాలు, దొండపండులా చెల్లాకైన అమ్మాయి. తల్లితండ్రిమీద బహు భక్తిగలది. సంసారం నడుపుకునే యీడొచ్చినపిల్ల. ఎలామర్చిపోతుంది.

బూ:— నర్సయ్యా యికఏంచేసినా లాభంలేదు.

న:— నిజమే డబ్బుఖర్చేగాని లాభమున్నట్లు తోచదు.

శ్యా:— కస్తూరినన్నందుకేడిపిస్తావ్ వొకసారి రాఅమ్మా నిన్నెవరన్నాదా చూరా నిన్నేమిఅనను రాఅమ్మా బడికియింకాక్లైముంది.

ఇంతపెద్దదానివి నాన్నతోనే కలిసివెళ్లాలా. వొకపాట పాడే
మ్మావింటాను. సంగీతం నీసొత్తమ్మా నాన్నజీతమొచ్చాక నీకు
మంచిబట్టలు కుట్టిస్తానన్నారుమీనాన్న. ఎదిగినపిల్లవు నీయి
బ్బంది నెరుగమంటావా. నన్నుచూచి పారిపోతావేం. దాచా
రా. ఎవరు మీబడిపిల్లలేనా (నూతిలో దొంగిచూచును) వోసి
దొంగముండా యీనూతిలో దాగున్నావా. నీకంతభయమెం
దుకమ్మా నిన్నేమన్నా అంటానా పల్లెత్తుమాట ఏనాడు అన
లేదు, ఎవరినన్నా అడకరాదు అన్నానేమో. రావేం బడికి
వేళైపోయింది అన్నంతిని బడికిపో సాయంకాలమొచ్చి ఆడు
కోరాదు. అదిగో పారిపోతావా ఎక్కడికిపారిపోతావ్ (నూతి
లో కురుకును)

బూ:— నర్సయ్యా చూస్తావేం నూతిలోపలకురుకు.

న:— బాబో నాకుయీతరాదు.

బూ:— నాకసలే యీతరాదే.

న:— కొంపమునిగింది యీకేసు మానిద్దరమీద పడితీరుతుంది.

జ:— అమ్మా అమ్మా నూతిలో పడిపోయావా. మమ్మల్నేమి చేయ
మన్నావ్. తమ్ముడు అమ్మదగ్గరకి మనంకూడాపోదాం.

బూ:— బాబు అలాంటిపని చేయకండి.

న:— మీఅమ్మనుమేంతీస్తాం, మీరేంకంగారుపడకండి.

గ:— మాఅమ్మను బయటకుతీయండి బాబు మీకు పుణ్యముంటుంది.
అమ్మారా అమ్మా అమ్మా బయటికి.

న:— తాడైనలేదే బూదెయ్యా?

బూ:— నాకండువ నీకండువ ముడివేసి పడవేద్దాం పట్టుకుంటుందేమో.

న:— మంచివుపాయమే. (కండువాలు ముడివేసి పడవేయును)

బూ:— అమ్మా మాప్రాణాలమీదకొస్తాది కండువాపట్టుకో తల్లీ.

న:— నామాటవిను నేను నర్సయ్యను మమ్మల్ని పాడుచేయకు నీకెం తడబ్బుకావాలో యిస్తాను. మీాకేయిబ్బంది కలుగనివ్వను.

( మునిగిపోవును )

బూ:— నర్సయ్యా ఏమిటిమార్గం. మునిగిపోయింది.

న:— మనం తప్పించుకొని పారిపోవడమే మార్గం.

బూ:— పిల్లలుగూడ పడిపోతారేమో.

న:— ఒకపనిచేద్దాం, యిద్దరిని పోలీసుస్టేషన్‌దగ్గరకు పంపుదాం.

బూ:— జగన్నాథం మీాయిద్దరుపోయి మాఅమ్మకు పిచ్చెత్తి నూతిలో పడిపోయిందని పోలీసువారికిచెప్పండి.

జ:— మంచిది (జగన్నాథం, గంగాధరం వెళ్లును)

న:— మనం యింతమట్టుకు చాలా అదృష్టమంతులం యీామెపోవడం పిల్లలకు మనకుతప్ప మరెవ్వరికి తెలియదు. మనమీాదకేమీా రాదు. త్వరగామనంపోయి మనప్రాణాలు యింటికి జాగవేసుకోడంమంచిది.

బూ:— నెమ్మదిగా అంటున్నావా నర్సయ్యా పుణ్యానికిపోతే పాపమెదురవుతుందనడం సహజం. ముందునడు.

న:— బూదెమ్మా పాపం యీాదిక్కులేని పిల్లల్నేమిచేద్దాం.

బూ:— యీాపరిస్థితులనుబట్టిచూస్తే ఏంచాయాలోఏమో ఏం తోచడం లేదు.

న:— జడిసిమనకెందుకని మనదార్ని మనంపోతెపిల్లలిద్దరుకూడ నాశనమైపోతారు. ఏదోవొకకంటెని కనిపెట్టాలి.

బూ:— వొద్దంటావా నర్సయ్యా యీాగండంతప్పాలంటున్నానుగాని.

న:— మనం జడపడమెందుకు కాకపోతె మనల్నడుగుతారు. ఎలాపడిపోయిందని మనం నిజంచెబుతాం.

బూ:— అంతేలే.

న:— నేలకుపోయేది నెత్తికి వ్రాసుకోడమెందుకని వెళ్ళిపోయి మళ్ళావొద్దా మనుకొంటున్నా.

బూ:— ఇప్పుడేపోదాంరా మరిఅదీవొకమాటే.

న:— పిల్లలొచ్చేవరకు వుండిపోదాం.

బూ:— పిల్లల్తో కలిసి వొస్తారేమో పోలీసువారు.

న:— మీరువెళ్ళండి వొస్తానంటారు.

బూ:— వాళ్ళిష్టమొచ్చినట్లుగా వొస్తారులే.

[ జగన్నాథం, గంగాధరం ప్రవేశం ]

న:— ఏమన్నారు బాబు.

జ:— వస్తున్నారండి.

న:— అయితే మేమిక్కడుండకూడదు వెళ్లొస్తాం. వారు వెళ్ళిపోయిన తరువాతవొస్తాం. ఖర్మకాండమంత మేమేసరినెత్తుకుంటాంలే.

గ:— అయ్యా మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోతారా మాకుదిక్కెవరు.

బూ:— మేంఎక్కడికివెళ్లం మీకేంభయంలేదు. మేము యీచుట్టుప్రక్కలనే వుంటాం. మీరేమికంగారుపడకండి.

జ:— అయ్యా మాతల్లిదండ్రికి ఎటువంటిసాయంచేశారో మాకుకూడా అలాంటిసాయమేచేయండి. మీమేలు ఎప్పటికిమర్చిపోం.

న:— తప్పకుండాచేస్తాం. వెళ్లొస్తాం.

గ:— మీకుభయమెందుకండి. మీరుమాకెంతో సాయపడ్డారనికూడ చెప్పుకుంటాం.

న:— బాబు వాళ్లకంటిలో పడడమెందుకు వారొచ్చినతర్వాత వొస్తాం.

జ:— సరేవెళ్ళిరండి.

న:— బూదెయ్యా పోదాంరా. (నిష్క్రమించును)

జ:— గంగాధరం మనమ్మపోయింది. నాన్నగారా జైల్లోవున్నారు.

అక్కయ్యా కాలంచేసింది. మనకుతోడెవరు లేరు. మనకుమనమే పోట్టపోషణచేసుకోవాలి. అధైర్యపడకు పోయినఅమ్మమళ్ళీ రాదు.

గ:— అన్నయ్యా మనబంధువులెవరు లేరా ?

జ:— మనదీవూరుకాదు. మనబంధువులున్నారో లేదో తెలియదు. అమ్మ మన మొగమైన చూచిందికాదు. మనమెలాబ్రతుకుతా మనుకుందో నాన్నకు ఏమిచెప్పమన్నదీ కూడ చెప్పలేదు. మన ల్ని పెంచలేకనే ప్రాణహత్య చేసుకుంది.

సీ॥ చిన్నబిడ్డలమని చింతయే లేకను

బల్మిప్రాణమునీవు బాసితమ్మ

తండ్రిలేనటువంటి తనయులన్ బెంచుట

భారమంచును నాయ బడతివమ్మ

ఏపాపమెరుగని యీపసికూనలన్

అన్యాయమునుజేసి యరిగితమ్మ

ఒకనిముషముగూడ నుండలేమిముపీడి

యిప్పుడెట్టులుంటిమో ఎరుగమమ్మ

గీ. ఎంత యన్యాయమునుజేసి ఏగితమ్మ

అమ్మమమ్మేరికప్పగిం చరగితమ్మ

అయ్యో చెప్పక యే మాయ మైతివమ్మ

అమపియని ఏరినిక పిల్వ మనెదొవమ్మ.

జ:— ఎంతలోఅంతర్ధనమయిపోయావు. జీవితంమీద ఎంతవిరక్తిజెందావ్ దీనంతకు కారణం లేమి. ఏముష్టియైనాఎత్తి నిన్నుపెంచలేకపో దుమాతల్లీ. మమ్ము కన్నందుకైనా కండ్లెదట లేకుండా పోయా వా. అమ్మా అమ్మాయని నోరార ఎవరిని పిలుచుకోమంటావ్.

గ:— అన్నయ్యా వెంటనేతీస్తే మనమ్మ బ్రతుకునేమో.

జః— గంగాధరం మతిపోయినఅమ్మను తీయడానికి ఏతాళ్ళో విసరినా పట్టుకుంటుందా. ప్రాణహత్య చేసుకోడానికి సంకల్పించుకున్న అమ్మ చెప్పినా వినుపించుకోడం చాలాకష్టం.

ఉ. జీవితమంత దగ్ధముగ జేసుకొనంగను పూనుకొన్న తా
భావములన్ని తున్కలుగ భగ్నము పర్చుకమాతపోయెనే
చావగనున్న వేలయిక చక్కటిమాటలు చెప్పగా చెవు
ల్కేక విధిబోధ చేయగను ఎక్కువ్యర్థమె బాధజెందినన్.

జః— గంగాధరం చెడిపోయేవారికి ఎన్ని నీతులుచెప్పినా వినరు. చచ్చేరోగికి ఏమందువేసినా బాగుపడదు. చావడానికి సిద్ధమైనవ్యక్తిని బ్రతికించుటకెంత ప్రయత్నంచేసినా బ్రతుకదు.

గః— అన్నయ్యా మనకెవరు లేకపోతె మనంజీవించడం ఎలాగ ?

జః— భగవంతుడేవున్నాడు.

గః— భగవంతుడన్నం తెచ్చి పెడతాడా అన్నయ్యా ?

జః— ఆయనయందు ధ్యానపరులైవుంటె ఆయన ఎవరిహృదయమైనా కరిగించి వారితోడ సహాయంచేయిస్తాడు.

గః— ఎవరో పెడతారని ఆశించుకొనివుంటె వారుపెట్టకపోతె మనగతేమవుతుంది ?

జః— అవును అదీయొకమాటే మనమిద్దరం కలసి ముష్టికిబైలుదేరుదాం

గః— రేపటినుండి బయలుదేరుదామా అన్నయ్యా ?

జః— బయలుదేరకపోతే మలమల మాడిపోతాం.

( తె ర ప డు ను )



# బడిపంతులు బ్రతుకు

## ఎనిమిదవ రంగం

[ జగన్నాథం, గంగాధరం ముష్టి ]

గం:— అన్నయ్యా మనంఎన్ని గంటలవరకు ముష్టెత్తుకోవడం ?

జ:— తొమ్మిదిగంటలవరకు ముష్టెత్తుకొని పదిగంటలకు బడికిపోదాం.

గ:— అన్న మో ?

జ:— ఇప్పుడుపోయి వొంటచేసుకోలేం. యీవేళకు బజ్జీలుకొనుక్కొని కాసిన్ని మంచినీళ్లుత్రాగి బడికిపోదాం. సాయంకాలం ముష్టికి వచ్చి యింకా మిగుల్నాడబ్బులు దొరికితే కూరతేమన్నా పట్టుకుపోదాం.

( పాటలు పాడును )

గ:— బాబు చూచివెళ్లిపోకండి. ధర్మంచెయ్యండి. పేదలం అనాథులం తల్లిదండ్రి లేనివారం.

జ:— మావంటిదీనులను చూడండి. తల్లిదండ్రిని గోల్పోయిన దురదృష్ట వంతులం. కూడుగుడ్డ లేని గర్భదరిద్రులం. మీరే మాకుదాతలు, తల్లిదండ్రులు. మమ్మల్నికన్నెత్తిచూడండి. మాదీనాలాపములాలకించండి.

సీ॥ ధర్మమే జయమంచు దానధర్మమును మా
వంటిదీనులకు చేయరెనో బాబు
కడుపుమంటతోనున్న కడుదీనులను జూచి
ధర్మమొసంగుడో దాతలార

తల్లిదండ్రి లేనట్టి పిల్లలమగు మాకు
ధర్మముచేయగా దలపరయ్య
మూడుదినములుండి ముట్టలేదన్నము
విద్యార్థులకు ముష్టి వేయరయ్య

గీ. బాధచెందుచునున్నట్టి బాలకులము
తోడునీడయు లేనట్టి దుర్భలులము
కొంపలేనట్టి యీపసి కూనలందు
కరుణజూపండి వోధర్మకర్తలార.

అడవిలో బ్రతుకు పక్షికైనా బ్రతుకున్నదిగాని మాకాతా వుకూడా లేకుండాపోయింది. ఆభగవంతుడు రాతిక్రిందనున్న కప్పకైనా కొంచం తావుచూపించాడు. మాకాతావుకూడా లేదు. కట్టెలమ్ముకొని జీవించువాడు కొంచమూదాయించూ వును. మానాన్న ఉపధ్యాయవుద్యోగంచేసి మమ్ముల నుయిం తదరిద్రులజేశాడు.

ఉ. అన్నముబట్టలేదయయొ యాదరణంబును జూచువారు మా కన్నయ తల్లిదండ్రిలును యాపదగడ్డుగనిల్చు వారలే రెన్నను లేనివారలము దీనులమెవ్వరు లేని వారమా పన్నులమయ్య మేముకడు భక్తితో వేడుచునుంటి మిమ్ములన్

మందనువీడిన మేషము ఆర్తనాధంతో తిరిగితిరిగి అల్లాడునట్లు మేంమీమధ్యను తిరుగుతున్నాం. మమ్ములనుఆదరించి మాకిం త ధర్మంచేయండి. పసిపిల్లలమైన మామొగంచూచి వెళ్లిపో కండి. మీబిడ్డలనుకొని మామొరాలకించండి. (పాడుకుంటు వెళ్లును) (బూదెయ్య, సర్పయ్య ప్రవేశం)

బూ:— సర్పయ్యా యీపిల్లలు బడిపంతులు కొడుకులేసుమా!

స:— మరింకెవరు వారే.

బూ:— పాపం యీ వుపాయం ఎవరు చెప్పి వుంటారు.

న:— ఆకలి మంటలతో నున్నపుడు కడుపు నుంటే చేయిస్తుంది. ఎంతప నైన.

బూ:— అవును పాపం. కొడా నీడా తల్లా తండ్రి ఎవరున్నారు.

న:— అవును గాని ఆశ్యామల సంగతి ఏమయిందంటావ్.

బూ:— ఏమవుతుంది నరసయ్యా. పోలీసువారొచ్చి తీయిస్తారు పిల్లలే దోపిచ్చి పట్టి నూతిలో పడి చచ్చిపోయిందని చెప్తారు. ఎవరు దిక్కు లేరుగదా యని ఆపోలీసు వారే ఏదో యేర్పాటు చేసి దహన సంస్కారం చేయించి వుంటారు.

న:— కాని మనమక్కడుంటె మనపీకె మీదకొచ్చి యుండునేమో అను కుంటాను.

బూ:— కాదనీ చెప్పలేము. అవునని చెప్పలేం. మనమాటలు ఎవరు నమ్ము తారు. అసలు మీరు అక్కడ వుండడానికి కారణమేమంటారు. ఆపైగ ఆడమనిషి. భర్త లేదు వొంటరిగా వుంది. ఏదో బలత్కా రిస్తే ప్రాణహత్య చేసుకుందని పోలీసువారువూహించి అక్కడ మనమే వుంటే తప్పక మా-సేసేవుండును. మన అదృష్టవశాత్తుచే మనం తప్పించుకుపోవడమే మంచితరుణోపాయమయ్యింది. లేక పోతె మనకు శ్రీకృష్ణజన్మస్థానమో తప్పితే ఏమరణదండనో అయ్యేవుండును. అంతమట్టుకు అదృష్టవంతులం.

(పాడుకొంటు జగన్నాథం, గంగాధరం వచ్చును)

న:— బాబు జగన్నాథం నేనుజ్ఞాపకమున్నానా ?

జ:— లేకేం బాబు నరసయ్యగారుకదు.

న:— అవును. చదువుకొంటున్నారా ?

జ:— చదువుకొంటున్నాం. నేనుతమ్ముడు తొమ్మిది పదిగంటలవరకు

యిలాగే ముట్టెత్తుకుపోయి. గంజికాచుకొని బడికిపోయి చదువుకొంటున్నామండి.

బూ:— యీవిషయం మీనాన్నకు తెలిసిందా ?

జ:— తెలిసేవుంటుందండి.

న:— మీఅమ్మగారిని నూతిలోనుండి పోలీసువారేతీసి దహనంచేశారా.

జ:— వారే చేశారు.

న:— మీనాన్నకు ఎవరు తెలియపర్చారు ?

జ:— పోలీసువారే తెలియపర్చారు.

న:— ఈమిష్టివలన రోజుకేమాత్రం వొస్తుంది ?

జ:— రెండురూపాయలవరకు సంపాదిస్తాం.

న:— మంచిది. యివిగో ఇరోఅయిదురూపాయలు పుస్తకాలు కొనుకోండి.

( పాటలు పాడును )

న — చాలా బాగాపాడారు బూదెయ్యా.

బూ:— పాడారంటె బలిపంతులుకొడుకులు. తండ్రిగాయకుడు తెలివైనవాడు.

న:— తల్లికూడ బాగాచదువుకుంది. తెలివైంది.

బూ:— అవునవును.

జ:— బాబు ఎంత తెలివైనవారై తేనేం. బ్రతుకు తెరువులేక ఋణబాధకులోనై చివరకు చెరశాలప్రాప్తయ్యారు.

ఉ. దారగపోసి తావయను ధర్మముగా పసిబిడ్డకెల్ల తా
శోరతనేమొ జూపిగద శుంఠలనెల్లను బాగుజేసితో
ఓరిమివోపి కెంతగనో యుర్విని జూపుచు ధన్యజీవియై
హారముబొందెనే కడకు అక్కట వార్ధికమందు నాన్నయున్.

బూ:— పాపం.

( మునసబు ప్రవేశం )

జ:— స్వామి చూచివెళ్లిపోశండి. ధర్మమేజయం. ధర్మంచేయండి.

ము:— ఎవరుమీరు ?

జ:— యీాగ్రామం బడిపంతులు కొడుకులం.

ము:— ముష్టెత్తుకుంటున్నారా !

జ:— ఏంచేయమంటారు ద్రోహులెవరో ద్రోహంచేస్తేను.

బూ:— మునసబుగారు ఏంచేస్తారండి. తండ్రి కారాగారశిక్షఅనుభవిస్తు న్నాడు. తల్లా పిచ్చెత్తి నూతిలోపడిచచ్చిపోయింది. యీాడొచ్చి నమ్మాయి స్కూలుఫైనల్ వరకు చదువుకుంది, తండ్రిమీాదబెం గబెట్టుకొని కాలంచేసింది. వున్నమగపిల్లలిద్దరు ముష్టెత్తుకుంటు న్నారు. అంతకంటె యికబ్రతుకేది. యింతవుణ్యమూ మీాదే నంటగా.

ము:— నాఋణం నాకుపారేస్తే నేనంతపన్చేయనయ్యా.

బూ:— వెనుకాముందు యిస్తాడుగాని యివ్వకపోతాడా.

ము:— ఎన్నాళ్లయ్యా.

బూ:— నీయిద్దరుకుమార్తెలకు, నీయిద్దరుకుమారులకు మూాడేళ్లు ప్రవే టుచెప్పినందుకు ఏమిచ్చావయ్యా.

ము:— అడిగినపుడల్లా చేలోపండిన తిండిగింజలు సరఫరాచేశాను.

బూ:— అదేమిటయ్యా వొకపిల్లకు నెలకు అయిదురూపాయలుచొప్పున నలుగురికి నెలకు యిరువైరూపాయలైతే మూాడేళ్లకు ఎంతసొ మ్మవుతుంది. అసలు వడ్డీపోను తిరిగిపంతులకే నూటయిరువై రూపాయలు బాకీవుంటావ్. పాపం ఎంతద్రోహంచేశావ్. నిలువునా ప్రాణాలుతీయడానికి నీమనసెట్లొప్పుకుంది. పిల్లలుగల వాడు. గర్భదరిద్రుడు నీయింటికివచ్చి తన్నబిడ్డలకు చెప్పినట్లుగా

చదువుచెప్పి పైకితీసుకువచ్చినపంతుల్ని నాశనంచేయడానికి ఎంత ద్రోహమాలోసించావ్. ఏనాటికైన ఆతని ఋణవిమోచన చేసుకోగలవా. మహాపాతకమనుభవిస్తావ్.

ము:— (నిర్ఘాంతబోయి) బూదెయ్యా నీవుచెప్పిందంత నిజం. తెలియక చేశాను. యీపాపానికి పరిహారం ఏదన్నావుపాయం చెప్ప వోయ్.

బూ:— పంతుల్ని తొందరగా జైలునుండి విడిపించి వారికుటుంబానికి కొంతమేలుచేయడమే దానికిమార్గం.

ము:— మళ్లా వుద్యోగం యివ్వరంటావా ?

బూ:— జైలుశిక్షఅనుభవించినవారికి వుద్యోగం యివ్వరు.

ము:— ఇప్పుడు నేనేం చేయను ?

బూ:— నేనుచెప్పిందే మంచివుపాయం.

ము:— నీవుచెప్పినవుపాయమెలాగున్న ముందునామతిచెడిపోయింది.

బూ:— భగవంతునియొక్క లీలలన్నీ అలాగేవుంటాయ్. రావణాసురుని పాపపరిహారం అవ్వాలంటె శ్రీరామచంద్రుని చేతిలోచస్తేనే గాని పాపపరిహారంకాదని చెప్పారన్నట్టు పంతుల్ని చెరిపితేనేగాని నీపాపం పండదయ్యా. ఎలాగైనా బాధపడేరోజులున్నై వాళ్ళ కుటుంబాన్ని నాశనంచేసి బాధపడినట్లే నీకుటుంబాన్ని భగవంతు డు అలాగే బాధపెడతాడు.

ము:— అమ్మయ్యో యింకేమన్నా బ్రతకగలనా అలాజరిగిన్నాడు.

న:— మునసబుగారు ఎవరికే కష్టాలున్నాయో ఎవరెరుగుదురు? ఆపర మేశ్వరునియాజ్ఞ ఎవరుతిరస్కరించగలరు. (పాట)

ము:— నర్సయ్యా అనుభవించడం తప్పదంటావా యీపాపం?

న:— తప్పించడం ఎవరితరం,

ము:— తప్పించుకోవడానికి నాకేది మార్గంలేదా ?

బూ:— మార్గమేముంది? వారికుటుంబానికి తగినసహాయం చేయడమే మంచిమార్గం.

( తెర పడును )



# బడిపంతులు బ్రతుకు

## తొమ్మిదవ రంగం

[ జైలు—పంతులు ]

వం:— భగవానుడా! లోకంలో నేనొక్కడనే యిటువంటి కష్టకాలమను
భవిస్తున్నానా. లేక నాబోటివారెవరైన అనుభవిస్తున్నారా.
లేకేమిలే కారాగారశిక్ష అనుభవించకపోయినా ఋణబాధలతో
నైనా బాధపడివుంటారని నాయభిప్రాయం. కాని అందరిలోను
నాజీవితమొక్కటే ఎందుకుపనికిరాని జీవితం.

ఉ. ఎందరులేరుయొజ్జలలో యిట్టిదరిద్రులు వారలట్టులే
జెందిరకారగారమున చేతను కాసునులేకపోయెనా
నిందలుబొందిరా యకట నీచముగా బ్రతుకంగలేదొకో
అందరిలోన నేనొకడ నక్కట యిట్టులనుంటి నయ్యయో.

ఈకారాగారశిక్ష ననుభవించి మరలపోయి ప్రజలలో ఎలా
తిరగ్గలను. ప్రపంచమంత పంతులంత మొండివాడులేడని చెప్పు
కుంటారు. యిప్పటికి నాసంగతంతా ప్రజలలోపూర్తిగా పాకి
పోయేవుంటుంది. నావుద్యోగం యిప్పటికి తీసేసేవుంటారు. ప్రై
వేటుస్కూల్లో పెట్టుకుంటామూ అంటె ఎవరిపిల్లల్ని నావద్దకువం
పుతారు. యికమాత్రం నమ్ముటకష్టం. నాగురించి మునసబు
దుష్టప్రచారంచేసేవుంటాడు. నన్ను యీగ్రామంలోమాత్రం
వుండనిస్తాడా బ్రతకనిస్తాడా. గ్రామాధికారిచెప్పిన మాదిరిగా

ప్రజానీకం నడుస్తుంది. పాడుఋణం చేయకపోయిన బాగుం
డేది. ప్రయోజకత్వం చెప్పినందుకు నెలకెలాగు లేదైన యిరువైరూపా
యలు తక్కువ కాకుండ యిస్తాడు. ఋణం ఎలాఅయిన తీరిపోతుం
దిగదా అనుకున్నా. అడక్కక్కర్లేదు సరేగదా చెరసాలప్రాప్తిం
చింది.

ఉ. ఏరికినేను ముందెపుడో ఎట్టిపకారము చేసియుంటినో
పోనము నేనుఏరికినో అక్కట చేసితినేమొగాని నా
వారలకెల్ల పూరయిము వాసముచేయుచు బంధికానలో
ఘోరము నేడ్చుచుంటిని సమో బూపుకు లేరను చూడకేగదా.

ఇనుమంతైన దయారసము లేని మానవాళిలో నాబోటిజ్ఞానో
దయం చేసిన ప్రజాసేవకుడనగు బడిపంతులను యిట్టి దరిద్రబాధ
ననుభవించుచుండ పాలించువారు లేరా. ప్రజానీకం కండ్లు
మూసుకొనియుండా. నాగోడెవరు వినువారు లేరా. ప్రపం
చమెంత గొడ్డుబోయిందు.

ఉ. పాలకులిచ్చు వేతనము పాసలకైన్యోదు మందుఖర్చుకై
చాలునో లేదోయెంచు కొడు సందియమొందుము రెల్ల వారలున్
ఆలియుపిల్లలున్ దినుచు నార్ధిక బాధనుపొందకుందురా
ఏరికి లేమిచూచిరయొ నేమియొసంగిరి యూరకే నీభువిన్.

ఓ భారతమాతా నీసేవజేసి నాశక్తినంతయు దారపోసినీకు
కళనుదెచ్చి దేదీప్యమానంగా వెలిగించి నిన్ను పరిపాలించు దీమం
తులనుగా తయారుచేసింది నాఉపాధ్యాయబృందమని వొక్కసా
రైన తలంచావా. బాల్యదశలో తరిఫీదుయిచ్చినది ఉపాధ్యాయు
డని గుర్తించలేవా. వ్యవసాయాభివృద్ధికి, పాడిపంటలపోషణకు,
ఘణితశాస్త్రఘనులకు, కర్మాగార వృత్తులకు, చిత్రలేఖనా
ఘనులకు, శిల్పశాస్త్రకోవిధులకు, కర్రి, యినుము, వృత్తు-

నక్షత్రశాస్త్రకర్తలకు, ఖగోళశాస్త్రచరిత్రకారులకు, ఆర్థిక, నైతిక బలములను ప్రసాదించిన అధ్యాపకులను మరచినావా తల్లీ.

చ. వరవడిదిద్ద నేర్పితిని పల్లవులనోట నిపింపజేసితిన్
దరచెడు శాస్త్రకోవిదుల దాతల నేతల జేసినాడనో
మరువని నీతివాక్యముల మానసులందున నాటజేసితిన్
బరువును నిల్పినాడ పరమార్థముకై యికనేను యీభువిన్.

తల్లీ యింతమాత్రమేనా. నేను నీకండ్లు తెరిపించి నీయిరుప సంకెళ్లను పటాపంచలు చేసి, నీవు స్వాతంత్ర్యమును మంత్రశక్తితో మటుమాయంచేసి కంఠకంఠాక్షరాలలో నీనామోచ్ఛరణ చేయుసంతతిని తయారుచేసిన ధీమంతులను అమ్మా నీకత్వంలోనున్నపుడు ప్రగ్గువాలకో నేర్పిన ఉపాధ్యాయులేయని వారికి సారైన నీకు జ్ఞాపకంవచ్చుటలేదా.

సీ॥ రణరంగమున గెల్చి రాజ్యమేలినశూర
వీరులని జేసిన ధీరులెవరు
కరిశాలనాయుక్తి బలమును ధైర్యమున్
గరిపినయట్టి యా ఘనుడెవండు
ఘణితశాస్త్రమునందు కడునిపుణులకెల్ల
విద్యనేర్పినయట్టి వీరులెవరు
చక్కగాను ఖగోళ శాస్త్రకోవిధులుగా
తరిఫీదుచేసిన గురుడెవండు

గీ. సకలశాస్త్రజ్ఞులకు బోధ సల్పి ఘనుల
చేసి నీప్రజ్ఞ వెలిగించు భూసురులకు
విద్యనేర్పిన యొజ్జలన్ వీడినావ
మరచితివమమ్మ తల్లిరో భరతమాత.

అన్నివర్ణాలను సమానదృష్టితో చూతువని ఆశించాను. గాని యింతపక్షపాతం చూపిస్తావని ఎన్నడూ అనుకోలేదు.

శా॥ నీలోనున్న టువంటిశక్తి యిలలో ధీరోత్తముల్ మైననో
ఏలన్ జూపవు ..........టూ యీనాటివారన్ననో
కాలిన్ జేసుక యూలి........ తా గోడెత్తనా కార్మికున్
బోలల్ నీవు సుఖ..........గన ...... భూ......యికన్ పంతులూ.

(నర్సయ్య ప్రవేశం)

న:— పంతులుగారు నమస్కారం.

పం:— నర్సయ్యా నమస్కారం. నీవైనా కాసింత సహాయపడి నాకుమార్తెను రక్షించలేకపోయావా?

న:— పంతులుగారు నేనువచ్చేసరికే ప్రాణాలు వొదిలేసింది. వొకవేళ తల్లికూడ ప్రాణాలు వొదిలేస్తుందేమో అని చాలామట్టుకు ఓదార్చి వచ్చింది.

పం:— అమ్మా నిన్నింత దిక్కుమాలిన దానను చేశానమ్మా. నీచావు యీపాపాత్ముడైన పంతులు చూచుటకు నోచుకోలేకపోయాడా తల్లీ. బాబు నర్సయ్యా తరువాత కార్యక్రమమెలాజరిగింది?

న:— ఆవిడచేతిలో దమ్మిడీకూడలేదని చెప్పింది. సరె ఆఖర్చంత నేనేభరించుకుంటా. నీవేమి అధైర్యపడకని వోదార్చి కార్యక్రమమంతా జరిపేశాను.

పం:— మునసబుగాని వొచ్చాడా?

న:— పంతులుగారువారువొస్తారని మీరెలానమ్మారు. మునసబుపూర్తిగా మీకుటుంబాన్ని నాశనంచేసి ముట్టెత్తించ దలంచుకొన్నప్పుడు

పం:— మునసబుకు ఆమాత్రం విశ్వాసంలేకపోయింది నర్సయ్యా. నావల్ల నేకవిధాలా లాభాలుపొందేడు ............ కుటుంబాన్ని నాశనంచేశాడు.

న:— మునసబుమాత్రం ఏంబాగుపడ్డాడులే.

పం:— మునసబుకేమి నర్సయ్యా ధనమదాంధుడు.

న:— పంతులుకుటుంబాన్ని నాశనంచేశాడని వూరంత గగ్గోలుపడి మునసబును తిట్టడం ప్రారంభించారు. యీవార్త మునసబుకు తెలిసింది. మునసబును ఎంతపనైనా చేసితీరాలని అందరు ఆందోళనపడుతున్నారు. గ్రామంలో అల్లర్లు మునసబుకు తెలియగానే మతిపోయి పిచ్చెత్తి తిరుగుతున్నాడు.

పం:— ఆ! పిచ్చెత్తిపోయిందా. పాపం ఎంతపనిజరిగింది. యిప్పుడేం చేస్తున్నాడు.

న:— ఏంచేస్తాడు. పిచ్చెత్తి రోడ్లమీద తిరుగుతున్నాడు. బండబూతులాడుకొంటు.

పం:— వూళ్లో ఏమని చెప్పుకుంటున్నారు.

న:— పంతుల్ని పాడుచేసినందుకు ఆవుసురు తగిలి మతిచెడిపోయి తిరుగుతున్నాడు, మునసబని చెప్పుకుంటున్నారు.

పం:— నర్సయ్యా దేవుడులేడా. నేనుచేసిన ద్రోహమేమిటో చెప్పకాకపోతే నోటుంది నేనువ్రాసియిట్టు. మునసబు నాకుబాకీవున్నట్టు నోటులేదు. ఆఖరికి పద్దుఅయినాలేదు. అందుచేత మునసబు నామీద దావాచేయగల్గాడు అంతేగా. ఆరువందల యిరువైరూపాయలు నేను అతనికి తీర్చాలి. ఏడువందల యిరువైరూపాయలు అతడు నాకుతీర్చాలి. అసలుబాకీలోనుండి మినహాయిస్తే తిరిగినాకు మునసబు నూటయిరువైరూపాయలు నాకు బాకీయుండవలసినవాడే. యీసత్యాసత్యాలు కచ్చేరీలు తీర్చకపోయినా భగవంతుడైనా తీర్చకపోతాడా నర్సయ్యా. ప్రభుత్వంవేసినశిక్షకంటె దేవుడు విధించినశిక్ష గొప్పది.

న:— కుటుంబాన్నంత నాశనంచేశాడుగా పాపం.

పం:— నర్సయ్యా ఏంచేయను. యీనాటికి యీకాలానికి యిలాజర గాలని నానుదుటవుంది. అనుభవించకతప్పదు. దాతలిఖితాన్ని తప్పించడానికి ఎవరితరం. రారాజు న.చక్రవర్తికి తప్పిందా. నవఖండాలేలిన హరిశ్చంద్రునికి తప్పిందా.

న:— కష్టాలుపడినా కడకు భార్యాభర్తలు కలుసుకున్నారు కొంతకాలానికి తరువాత సుఖపడ్డారు.

పం:— మేం కలుసుకోమంటావా నర్సయ్యా?

న:— ఆ! ఎక్కడ కలుసుకోడంస్వామి (దుఃఖపడును)

పం:— ఏంనర్సయ్యా అలాఅంటున్నావ్?

న:— ఏంచెప్పమంటారు.

పం:— ఏంజరిగిందో త్వరగాచెప్పు నర్సయ్యా?

న:— శ్యామలా దేవిగారికి మతిపోయి నూతిలోపడి — (దుఃఖపడును)

పం:— అమ్మొమ్మో నాతల్లిగూడా చనిపోయిందా(మూర్ఛిల్లిపడిపోవును)

న:— (కండ్లనీరుపెట్టును)

పం:— శ్యామలా శ్యామలా తృటికాలంలో మాయమైపోయావా. నర్సయ్యా యికనేనుమాత్రం బ్రతికివుంటానా.

న:— పాపం ఎవరైనయింతే. భార్యాపోయిందని చెప్పకపోయినా బాగుండేది. ఆపాపం నేనుకట్టుకున్నానేమో. చెప్పి బాధపెట్టాను. భార్యాతో ఎవరుసాటొస్తారు. కార్యేషుమంత్రి అన్నట్లు సమస్త సౌఖ్యాలు భార్యతో ననుభవించిన యీవేళ భార్యాపోయిందీ అంటె విచారపడని పెద్దమనుష్యులెవరు.

పం:— శ్యామలా నన్నింతమోసంచేసి పోతావని కలలోనైన తలంచాను కాను. నేనువచ్చువర్కు మనముద్దుబిడ్డలను కాపాడుచుందువుగదా యని ఆశించాను. నాయాశలన్నీ నిరాశలుచేసి పోయావా. నోరెరుగని చిన్నబిడ్డల్నేమిచేసిపోయావ్. నామొగమైన చూడ

కుండ నీజీవితాన్ని ఎంతో నిరాశచేసుకున్నావ్. శ్యామలా నీవులేనిది నాకెందుకీప్రపంచం. నీవులేనిది యీ మొండిజీవితా ల్తో జీవించియుండగలనా. ప్రాణహత్య చేసుకున్నావా. అబ్బబ్బా భరించలేను యీదుఃఖాన్ని. వియోగబాధతో శ్యామలా శ్యామలాయని దుఃఖసముద్రంలో మునుగుతూ తేలు తు జీవన్మరణాలనైన భ్రమించి భ్రమించి భ్రమసిపోవడానికే ఆలోచిం చావా. యీకారుచీకటిలో కన్నీటకాల్వలలో చివికిన గుండె తో దారితెలియని గాటసాగినై అగాధములోబడి చచ్చుటకే నీవుపన్నినపన్నుగడ.

సీ॥ గాలితుపానుచే చీలిపోయిననోడ
వలె మనబ్రతుకయ్యె వసుధనందు
పక్వమునకువచ్చి పండ్లతోడను పూవి
ఫలవృక్షమే నేల పడినయట్లు
ఈనబోద్దుల జొన్న తోనున్న చేలన్ని
వరదముపడ జనుల్ వగచినట్లు
కాకిపిల్లలనెల్ల కాలితోడనుతన్ని
లేచిపోయినరీతి లేమయయ్యె.

గీ. బాండవము బ్రద్దలై పోవు వగదిగాను
నేడు మనసంసారంబింత నీటగలసె
నని విరక్తి నిజెందినా నబలనీవు
నేనుమాత్రము బ్రతికి యింకేమిసేతు.

సమస్త సుఖదుఃఖాలు అనుభవించావ్. బాహ్యాడంబరమైన కార్యాలకోసం ఎంతో శ్రాపత్ర్యంపడ్డావ్. అంతాగుర్తించావు. పాపపుణ్యాలెమరొన్నావు. యిక దేనిపై నీకాశ. చాలు చాలు యింకా బ్రతికియుండడం పాపఖర్మాన్ని అనుభవించడంతప్ప

వేరొకటి కన్పించదు. యీఘోరమైన పాపతిమరంలో కడ గండ్లపాలవడంకంటె జీవితాన్ని పాలించుకోవడం శ్రేయస్కరం.

ఉ. జీవితబాధకంటె పసి జీవులబాధలకోసమీవు నీ
జీవిని దారబోసితిక చెప్పకొనంగవు ఘారభావమున్
నీవును యిచ్చెదాతవని నెమ్మని పేరుగడించినావొకో
ఏవిధమైన కిల్బిషము యీవునెరుంగవదేమొ మానసా.

ఈపాపిష్టికండ్లతో యీమాయలోకాన్ని చూడలేను (కండ్లు పొడుచుకొనును)

న:— వొద్దువొద్దు పంతులుగారు. నామాటవినండి (లాభంలేకపోవును) పంతులుగారు ఎంతఘోరమైన పనిచేశారండి. ఆ యిద్దరిపిల్లల నైన కండ్లతో చూచుకొని పెంచుకుంటారనుకొంటె మీరు కూడా యిలాంటిపనిచేశారా ?

పం:— నర్సయ్యా నీవేమి విచారపడకు. బ్రతికివుండి కండ్లున్నను యొకటే లేకున్ననుయొకటె. పిల్లలేంచేస్తున్నారు.

న:— ముష్టెత్తుకు జీవిస్తున్నారు.

పం:— నారాయణ. బిడ్డలారా మీకెంతగతిపట్టింది. నాకు పుట్టకపోయి నను బాగుండునేమో. నేను జీవించియుండికూడా మీకీ కష్టా లుపెట్టిన దౌర్భాగ్యుడను. నర్సయ్యా ఏమన్నా చదువుకుంటు న్నారా పూర్తిగా బడిమానివేశారా.

న:— లేదులేదు బడికి సక్రమంగానే పోతున్నారు. ప్రొద్దుటె ముష్టికి పోయి తొమ్మిగంటలకువచ్చి వొంటచేసుకొని బడికిపోతున్నారు.

పం:— నాకు పట్టుకున్న ఖర్మగతి పిల్లలనుకూడ పట్టుకుంది.

[ జైలర్ ప్రవేశం ]

జై:— పంతులుగారు జైలునుండి మిమ్ము నేడే విడిచిపెట్టేస్తున్నాం. మీరిక యింటికి వెళ్లిపోవచ్చును. (తాళముతీసి పంపివేయును)

( తెర పడును )

# బడిపంతులు బ్రతుకు

## పదవ రంగం

[ మునసబు పిచ్చివాడై మతిపోయి తిరుగును ]

ము:— హా. హా. హా. బలేపంతుల్లే సుబ్బా పంతుల్ని తీసుకురా. ఏమోయ్ పంతులు కండ్లుమీదకొచ్చై. సిన్న ప్రివేటుచెప్పడానికొచ్చావ్ కాదేం. జ్వరమొస్తే యింటికొచ్చి యీవేలకురాలేనని చెప్పలేకపోయావా. నీవుచాలా గర్వపోతువు. అప్పుమాట అంతేచేశావ్. అప్పు ఎగగొట్టడానికి ఎన్ని పన్నుగడలన్నా పన్నావ్. అప్పుపారేయి బుద్ధిలే డిస్మిసుచేయిస్తా చూడు. నీకుజీతమెంత పంతులు. పాతికయీదేయలే నిన్నుచూస్తే నాకు చాలా జాలేస్తుందిసుమీ. రామిరెడ్డి కాలువలో మన్నంత త్రోలుకపోయి పొలంలో వేసుకున్నాడు. యీబైరూపాయలిప్పుడే పట్టుకొస్తానన్నాడు. అదేమన్నా వసూలుచేశాడా యీగాడిదికొడుకు పని తీసేస్తే గొల్లుమనేదుస్తాము. కరణమంత కంటె కన్పించడు. వాడికి యీమధ్య వొళ్లు పొగరెత్తిందిలే. సుబ్బన్నగాడిపేరుమీద పదిఎకరాలభూమిని రప్పించి నేనేదో పండించుకుంటున్నానని పెడిబాబుసొమ్మేదో పోయినట్టుగా పద్దులో ఖాళీగావున్నట్టు వ్రాశేడు. పన్నులేమి వసూళ్లు కావడంలేదంటుంటె పన్నులన్నీ మునసబు వాడేసుకుంటున్నాడని రిపోర్టు పెట్టాడు. యీవెధవలు పాడుచేద్దామనుకుంటె పాడేపోతానా నేను. పూర్తిగా తలంచానాఅంటె మనైపోతారు. పంతులు

గాడ్ని పంపేసినట్టు వీళ్లందర్ని జైలుకుపంపించేస్తా. మునసబు సంగతి పూర్తిగా అర్థంచేసుకోవడంలే.

[ నర్సయ్య, బూదెయ్య ప్రవేశం ]

న:— బూదెయ్యా మనమనుకున్నట్టె జరిగిందిసుమా.

బూ:— ఏమిటి నర్సయ్యా ?

న:— అడుగో మునసబు మతిపోయింది.

బూ:- జరిగిందా ఆఖరికి. ఏమండోయి మునసబుగారు మిమ్మల్నే! పలకరేం.

న:— ఎన్నిపాపాలొడిగట్టుకుంటేనే గాని యింతమహాపాప మనుభవిస్తున్నాడా బూదెయ్యా.

బూ:— సామాన్యంగా నాశనంచేశాడా ఆపంతుల్ని. ఆపునురంతపోసుకున్నాడు.

న:— మునసబు అధికారంతో పంతుల్ని వ్రాతల్లో చేతల్లో గులాంగా చేసుకున్నాడు. యింటిముందర కుక్కవలె చూచాడు. కవుల్లు కదపాలు ప్రామిసరీనోట్లు యింటిపద్దులు కరణంలెక్కలు వొకటారెండా అనేకమైన పనులు చేయించుకున్నాడు. నలుగురు పిల్లలకి మూడేళ్లు ప్రవేటు చెప్పించుకున్నాడు. పైపెచ్చు ఆరు వొందలప్పుకట్టి అన్యాయంగా అరష్టుచేయించాడు. ఈన్యాయా న్యాయాన్ని ఎవరుచూడకపోయినా భగవంతుడైనా చూడక పోతాడా. ఆఖరికి మతిపోయి తిరుగుతున్నాడు.

బూ:— నర్సయ్యా ముందుగతులు తెలీక పీనాసితనం ఎక్కువయి ప్రజల్నిపీడించి పరులధనాని కాసించి గర్వంహెచ్చి అహంకారం అధికమై దేవునికిగూడ జడియకతిరిగే పెద్దమనుష్యులకు యిట్టి తిప్పలుగాక మరెట్టితిప్పలు.

న:— బూదెయ్యా మనం తనతప్పులు చెప్పుకోనేకంటే తనకేదన్నా ఉప
కారంచేస్తే చాలాబాగుంటుందేమో అనుకుంటున్నా.

బూ:— మతిమాలినవానికే ముపకారంచేయగలం.

న:— తనయింటికి తీసుకపోయి అప్పగిస్తే బావుంటుంది. అదేమనంచేయ
వలసిన మహోపకారం.

బూ:— అదీవొకమాటేగాని పట్టుకోలేంగా.

న:— ప్రయత్నంచేయడంమంచిది. అన్నట్టు పంతుల్ని చూశావా.

బూ:— ఏడీ.

న:— ఇంటికొచ్చేశాడు. పాపం భార్యాబిడ్డపోయాడనుకుంటే తనరెం
డుకండ్లు పొడిచేసుకున్నాడు.

బూ:— ఎంతపని జరిగింది.

న:— జరిగిందంటె ఆయవమానాన్ని భరించలేకపోయాడు. చివరకుముష్టి
కూడు తింటానాఅని అంతపనిచేశాడు.

బూ:— ఆస్థితిలో బ్రతకడంకష్టమే.

ము:— ఎవర్రామీరు పన్నులు తగ్గించాలంటె నాచేతిలో వుందటార్రా.
అర్జీలుపెట్టుకోండి. చేతగానిఎదవలుకాకపోతె పండిన పంటంతా
గవర్నమెంటు కప్పగించుకుంటూరా. కొంచం మిగుల్చుకొని
ఏచీకటివర్తకమో చేసుకోవాలి. సుబ్బా మిద్దిమీద పిచ్చుకుం
చం యిలాతీసుకరా. పాలేరు రామిగాడికి గింజలుకొలిసివ్వాలి.

న:— మునసబుగారు.

ము:— ఏం మతిపోయిందా అలా అరుస్తున్నావేం.

న:— ఇంటికిరండి.

ము:— కొట్టువేశైందిరా సుబ్బా ?

న:— బూదియ్యా మనం అలాగే చూస్తుంటె కుదురదు. నీవొకరెక్క
నేనొకరెక్క పుచ్చుకొని యీడ్చుకొనిపోదాం రా.

బూ:— అలాగేపట్టుకో (చెరోరెక్క—పట్టుకొనును)

ము:— నన్ను విడిచిపెట్టండి. పంతులు నిన్నేమి అన్యాయం చేయను. నాఎదురుగుండా రా.

న:— మునసబుగారు రండి (యీడ్చుకొనిపోవును)

( తె ర ప డు ను )



# బడిపంతులు బ్రతుకు

## పదునొకండవ రంగం

[ పంతులు, జగన్నాధం, గంగాధరం ]

పం:— పరమాత్మా! యింకా ఏంచేయడానికి బ్రతికించావో తెలియదు. పిల్లలకు ఏదారి కన్పించడంలేదని శంకోచించి భూమ్మీద బ్రతికి వుండాలిగాని వొక్కసారి ఏనీటనోబడి కండ్లుమూసుకోవలసిన వాడనే.

ఉ. కాలముచేసెనా కొమరి కష్టమొకింతయు జూడలేక నా
ఆలియు నూయనేబడెను అక్కట నాకను లెల్లపోయెనే
బాలకు లిర్వురుగ్ తుదకు బాటలయందున ముష్టినెత్తుకన్
గాలముబుచ్చుచుండె కల కాలము యిట్టుల గడ్పుగావలెన్.

జ:— నాన్నగారు మీరేమి విచారపడనవసరంలేదు. కాలమొకరీతిగా ఎన్నడు గడుపలేం. లలాటలిఖితం ఎలావుండునో అలా జరక్క తప్పదు. కానున్నది కాకమానదు. ఎందుకీవిచారం.

ఉ. పేరునుగాంచినారు తమ బిడ్డలరీతిగ బాలబాలికన్
వీరులజేసినారు తమ విద్యనుజెప్పిరి వేనవేలకున్
బీకులచేయలేదకట భేదముజూపగలేదు నేటికీ
తీరుగ కాలచక్రమయొ తిర్గగ నేరిక నాపువారలున్.

ఏకాలానికి ఏదెట్లుజరుగునో ఎవరికి తెలియదు. కాలచక్రం అనేకవిధాల తిరుగును. మేమెలాగో మిమ్ములను పోషించుకుంటాం. దానికి మీరు ఏవిధమైన సందేహ మొందనవసరంలేదు,

ఉ. రోజులు మోసకారులకు లోభులకున్ గద లోకమంతయున్
వేషము వేసుకొన్న యవి వేశలు లంచముతీయువారికిన్
ద్వేషమురోషమున్ గలిగి వేడగచిత్తము కర్గునట్టి యీ
దేశమునందు యొజ్జలకు తిండియు గుడ్డయుకూడ నుండునా.

పం:— అందుకొరకే నాకీదురవస్థ గలుగుటకు కారణం. మీఅమ్మయు అక్కయు పోవుటకు వేరొకకారణమేమున్నది. తలపునకు తెచ్చుకుంటె గుండెబ్రద్దలైపోతూంది. నేనుజీవించడం చాలా కష్టం.

జః— అమ్మకు యిసుమంతైన కనికరంలేకపోయింది. మాకండ్లెదుట అమ్మలేనందుకు మీరుకూడా లేకపోతె మాజీవితాలుమాత్రం భూమ్మీదవుండడమెందుకు. మేంకూడ ఏదోదారిచూచుకోడం మంచిది.

పం:— నాయనా అంతపనిమాత్రం అవలంబించకండి.

జః— తమయావజ్జీవమంతా ప్రజాసేవకై వినియోగించి చివరకు గర్భదరిద్రంతో బాధపడుతు కుటుంబాన్నంతా నాశనంచేసుకొని కాటికాళ్లుచాచుకొని వున్నారు.

మ. సుఖమున్ బొందితినీవొకప్పుడును నిన్ జూడంగ యీనాటికి
న్నకటా యిట్లయిపోయినావుగద యీ యధ్యాపకోద్యోగివై
ఒకరేనీవిటులుంటివోయనుచు నిన్ యోదార్చి నీగోడునే
తెగటార్చగల పెద్దలేరు గలరా దేశంబునన్ యక్కటా.

ఏమానవమాత్రునికైన మనకుటుంబ పరిస్థితులు జూచిజాలి జెందని వారెవరుంటారు. వేనకువేలుగా బాలబాలికలకు విద్యాదానముచేసి శరీరమంత శుష్కించి చివరికింత హీనస్థితిలోనుండడానికాకారణం. ఆనాడు గోచిపాతరాయుళ్లు యీనాడు ప్రభులైనవారు గ్రహించలేకపోవుటచేతనే.

ఉ. బల్లలుఎక్కి మాటలను బాగుగబల్కిన వారినందు రే
ఎల్లరు నాయకుండనుచు ఎన్నెరయొ బిడ్డలు నెత్తిమోపునే
చల్లగనిత్తు రే పదవి చాటుదు రే మహనీయుడంచు మే
యుల్లమునిచ్చు యొజ్ఞులను యొక్కరుజూడర దేమి పాపమో.

నోరున్న వారికే గౌరవపదవులు, వుద్యోగాలు మాటసహాయం, ధనసహాయం. ఏమారుమూలనో తాటియాకుల గుడిసెలోబడి నాలుగక్షరములునేర్పి విద్యావంతులుగ దేశోద్ధారకులుగను ప్రభువులుగను తయారుచేసిన యొక పల్లెటూరుపంతులను ఎవరుచూస్తారు. వీరిగోడెవరింటారు.

ఉ. పల్లెలయందు పాట్లుపడు పంతులజీవితమెంత చిత్రమో
ఉల్లమునందు బాధనిక యొక్కటిగాదిక చావొ రేవొనో
తెల్లముజేసి చెప్పుటకు తెర్వునులేనటువంటి జీవితమ్
గృళ్ళికృషించి పోవునయొ కొండలకోనలయందు పంతులున్

హార్భాటమైన పటాటోపములకే రోజులు. ఆప్రజ్ఞ బడిపంతులకు చేతరాదు. ప్రపంచాన్ని మోసంచేసేశక్తియుక్తి బడిపంతులకులేదు.

పం:— నిజమేచెప్పావు నాయనా. అజ్ఞానులను జ్ఞానవంతులనుజేసి దుర్జనులను సజ్జనులనుజేసి, దుష్టులను శిష్టులనుజేసి పుణ్యంకట్టుకున్నందుకు ఘోరపాపమనుభవించితి మనుటలో సందేహంలేదు. ముప్పదిదినములు గుండెలు గరిసెలుబడినట్లు వాగివాగి నాలోనున్న భావాలు ఎదుటవారి హృదయాల్లో పడవేసే సరికి నామున్తాతలు దిగివొస్తాను. అయినపాతికరూపాయలు వేతనంఎచ్చుదు దిగదు.

ఉ. వేతనమందుకొన్న పది వేలుగ నాపదిరోజులెంచు మా
ర్గూాదురతేమొ చెప్పుకొన యాక్షణమే ధనవంతుడుండు నా

రీతిగ సంచరించెదము లేమికో వేదనచెందుచుండె మా
వేతనమారువెన్క యిక వేళ్లను లెక్కనుబెట్టుకొందుమో.

ఆపాతికరూపాయల్లోనే భార్యాబిడ్డల్ని పోషించుకొంటు నెల
కుపదిరోజులు పస్తులుపడి ఋణబాధల్తో బాధపడి ధైర్యస్థైర్య
ములు చంపుకొని కొనప్రాణాల్తోనుంటాం. మా ఉపాధ్యాయ
బృందం.

జః— శ్రీహరి ఎంతద్రోహం. పశువైన గడ్డివేస్తే పాలిస్తుంది. పిడికె
డన్నం పడవేస్తే కుక్కయైన యింటివద్ద మొరుగుతుంది. దేశా
నికింతవుపకారంచేస్తే కడుపునిండా కూడుపెట్టనపుడు మానవుడై
బ్రతికేకంటె నడిసముద్రములో మునిగితేమేలు.

పం:— నాయనా ఎనాటికైనా దేవుడాశీర్వదిస్తే ఏవుద్యోగానికి పోయినా
ఉపాధ్యాయుని దరిద్రాన్ని పోగొట్టే శాసనాన్ని ప్రభుత్వంవారు
ఏర్పాటుచేసేలాగు నీశక్తంతా ధారపోయాలి. ఉపాధ్యాయుడే
నిజమైన దేశభక్తుడని ఎల్లరుగ్రహించునట్లు ప్రచారంచేయాలి.
ఉపాధ్యాయునివంటి కార్యసాధకుడు, యోధుడు కంచుకాగడా
బెట్టి వెదకినా కానరాడని నలుదిక్కులా మూరుమ్రోగించాలి.

జః— నాన్నగారు నాజీవితంలో తప్పక తమకోరిక నెరవేరునట్లు చేస్తాను.
చేయించితీర్తాను.

పం:— నాయనా పరీక్షప్యాసయ్యావా?

జః— ప్యాసయ్యాను. స్కూలుఫైనల్ సీటుకూడ సంపాదించాను.

పం:— మంచిది బుద్ధిమంతుడవయ్యి పైకివచ్చి నాపేరుకీర్తులను నిలబెట్టు
గంగాధరం నీవుకూడ ప్యాసయ్యావా.

గం:— నాన్నా ప్యాసయ్యాను. ఫిఫ్తుఫారంలో చేరాను.

పం:— బిడ్డలారా మీరుచాలా పైకిరాగలరు. అదృష్టవంతులు. నన్ను
మర్చిపోక నాపేరుకీర్తులను నిలబెట్టండి. మిమ్ములను చివరపరకు

చదివించలేని అసమర్థుడనైనందుకు చాలా దుఃఖపడుతున్నాను. అర్ధరాత్రికావచ్చింది. యికపండుకోండి. (పిల్లలునిద్రించును)

వం:— దైవమా పిల్లలను పెంచలేని అసమర్థుడనైనదిగాక అంధుడనై యింకను వీరితోగూడ సేవచేయించుకొని ముష్టిబ్రతుకుకూడా జీవించనా ఎందుకు నాకీమొండిజీవితం. ప్రపంచమా గుడ్డిది. నేనంతకంటె గుడ్డివాడను. అయినపుడు యీఅంధకారబంధురంలోబడిన నాకెందుకీపాడుసౌఖ్యం. యిప్పుడేపోయి నాజీవితాన్ని ఆగంగమ్మతల్లికి కానుకగా యిచ్చుకుంటాను.

( నిష్క్రమించును )

జ:— నాన్నగారు (కండ్లనులుపుకొని) పలుకరేం (నలుదిక్కులాచూచి) ఎక్కడాలేరే నాన్నగారు. ఎక్కడికిపోయారోగదా.

గం:— అందుకేగాబోలు నిద్రపొమ్మని తొందరపెట్టారు నాన్నగారు. అన్నయ్యా మనమెంతఓదార్చిచెప్పిన రవ్వంతైన ధైర్యంతెచ్చుకోలేకపోయారు యిపుడీనిశీధసమయాన్ని ఎక్కడికిపోయి వెతికితీసురాగలం.

జ:— అయినా ప్రయత్నంచేసిచూద్దాం.

గం:— ఇంకెక్కడినాన్నగారు. మనమ్మమనకు కన్పించిందా. అలాగే నాన్నగారుకూడ మటుమాయమైపోయారు.

జ:— తమ్ముడు ధైర్యంతోనుండు. నిరుత్సాహపడకు. ఎప్పటికైనా నాన్నగారు మనల్ని కలుసుకోకమానరు.

గం:— అన్నయ్యా పిచ్చితలంపుకాని. అంధుడైననాన్న ఎక్కడికిపోతాడు. మనసుత్యజించుకొని అమ్మకుమల్లె ఏనీటనోపడి మాయమైపోయివుండాలి.

జ:— పూర్తిగాప్రొద్దెక్కిన తరువాత సర్పయ్యవద్దకుపోయి యీవార్త చెప్పి నాన్నగారిని వెతికిద్దాం.

గం:— అన్నయ్యా మనం తెచ్చినముష్టి నాన్నగారుఅనుభవించుట కిష్టం లేకకాబోలు ఆవేదనపడి చెప్పకయే వెళ్లిపోయారు.

జ:— అవును అతనిజీవితంలో అట్టిపనిమాత్రం ఎన్నడు చేసియుండలేదు. కాబట్టే వారికది యిష్టంలేకపోయింది.

సీ॥ కనుగాయలని యింత కనికరమును లేక
చనినావొ మమువీడి కన్నతండ్రి
ఏమితలంచీవు యిర్వురన్ విడనాడి
ఎచ్చోటకేగితో ఎరుక పడదు
తుదిసందేశమున్ వదిలముగను మాతో
యందుకేచెప్పి నీ వేగినావొ
బాగుపడ గదృష్ట భాగ్యమున్నదిమాకు
నాశగొల్పుచు మాకు నరగినావొ

గీ. ఇంతలో నీకునువిర క్తి ఏలకలిగె
కన్నసుతులను జూచింత కరుణలేక
పోయెనాతండ్రి మమువీడి పోయినావొ
పసిగిపోతివ నిన్నెడ వెదకుకొందు.

( తె ర ప డు ను )



# బడిపంతులు బ్రతుకు

## పండ్రెండవ రంగం

[ జగన్నాధం, గంగాధరం ]

జ:— గంగాధరం యింకెక్కడినాన్న యీఅడవిప్రాంతమంతా గాలించాం. చూడరానిచోట్లెల్ల చూచాం. అడగరానివారి నెల్ల అడిగాం. నాన్నగారిజాడ యినుమంతైన తెలిసిందికాదు. తల్లిదండ్రిలేని పిల్లలుగా నుండవలసినవారిత మనముదుట వారికివుంటె నాన్నెందుక్కనపడతాడు.

ఉ. అమ్మకుదూరమైతి మఱియు యక్కట తండ్రినిబాసిపోతిమో
ఇమ్మహిమందు యిద్దరము యీవిధికాలము గడ్పగావలెన్
రమ్మనిపిల్వరేమి విన రారయొ చెప్పుకొనంగ నెవ్వరున్
పొమ్మను వంచచేరగను పుణ్యమతుల్ కనరారెవరిలన్
ఏపాపంచేసి పుట్టామో యీనాడుఅనుభవించవలసివచ్చింది.

గం:— అన్నయ్యా మనతల్లిదండ్రులు ప్రపంచానికి సేవచేసి ధన్యులయ్యారు. పేరుప్రతిష్టలు గడించి న్యాయముగా ప్రవర్తించి ఎల్లవారికిని తలలో నాల్కయై మర్యాదగడియించి మానవత్వం నిలబెట్టుకొని ప్రవర్తించారు. లోకంలో తాను నేర్పినవిద్యతో ప్రవీణులైనారు. మనకిట్టిగతి ప్రాప్తించింది.

మ. కవులున్ గాయకపండితోత్తములనో కార్యాభిలాషుల్ గనో
భవతిన్ బాధనుజెంది నేర్పితివియూ భావాలతో విద్యనే

నవభావాలతో నేలుచుండెనదెయి యీ నాడేను మంత్రిత్వముక్
ఎవరున్ జూడరు యెంతమాత్రమకటా యీపంతులన్ యక్కటా

వారిభావాలు బాలబాలికల హృదయాల్లో అమోఘంగా జొనిపారు. కడుపుమంటలోనైన స్వలాభాపేక్షమాని వొకరిద్వేలి తో చూపించుకొనక సంపూర్ణమైన విశ్వాసాలతో విద్యాబోధన చేసి నిపుణులఁ జేశారు.

మ. దినముల్ మంచిగజూచి పాపలకు సందేశంబు గోనా మహా
యనుచుక్ నాటినభీజమే మొకద తానాహ్వాన మంత్రిముక్
గనజాలర్ యొకపల్లెపంతు లెపుడో కష్టాలునాకై పడెన్
యనరే యెప్పుడుజాలిజెందరొకరే నయ్యయ్యొ యోయగ్రిజా.

జః— గంగాధరం లోకానికెంత సేవచేస్తేమాత్రం బడిపంతులు గోడెవరిం టారు. వారికష్టాలు ఎవరువిచారిస్తారు.

ఉ. పాలకులిచ్చు వేతనము పాలెరుకిచ్చినదైన తేదాకో
చాలదుకూడు గుడ్డకును సందియమేమియు లేదు దానిలో
ఆలియుపిల్లలున్ మగడు నంతును లేసటువంటి వస్తులున్
జాలగ పడ్డరే తెలియ జాలరు ఏరును యీజగంబునన్.

అన్నివుద్యోగాల్లోను ఉపాధ్యాయుని వుద్యోగం బహులో కువ. జీవితమూ ధన్యమైంది. సేవానిష్కల్మషమైంది. గౌర వమూ ఆత్మగౌరంగలది. అయితే ఎందుకు ధరిద్రదేవత తాం డవమాడునపుడు.

గంః— అన్నయ్యా. నాన్నగారిసంగతి యిపుడెలాగ తెలుసుకోవడం.

బః— అదుగో దొరయ్యగారు వొస్తున్నారు. ఆయనకేమన్నా తెలుసు నేమోఅడుగుదాం.

( దొరయ్య ప్రవేశం )

దొ:— జగన్నాథం మీనాన్న కన్పించారా ?

జ:— ఇంకెక్కడినాన్న బాబు నాన్నకు మామీద విరక్తిపుట్టి ఎలాగో వెళ్లిపోయారు. అన్నిచోట్ల వెతికి వెతికి వచ్చాం. ఎక్కడ కన్పించలే.

దొ:— పాపం ఎక్కడికిపోయారోగదా. మీరేమైన అన్నారా.

జ:— మానాన్న మాలోచేరుకొన్నదే పదివేలని ఆనందించాం. మమ్మల్నినిద్రపోనిచ్చి నిశీధసమయంలో ఏమిచెప్పకుండా పోయారు.

గం:— మానాన్న మీకెక్కడైనా కనిపించాడా ?

దొ:— కన్పించకేం సముద్రతీరాన్ని కన్పించాడు.

గం:— ఇక్కడెందుకున్నారని అడిగారా ?

దొ:— నాప్రాణాలమీద నాకేమాత్రం ఆశకూడా లేదన్నారు. నేనిక జీవించననికూడా చెప్పారు. నేనెంతో బ్రతిమాలాను.

జ:— (కన్నీరుకార్చుచు) నీజీవితంమీద నీకెంతవిరక్తి అయిపోయింది. ప్రాణహత్యచేసుకోడానికి నీవెంతపట్టుదలవహించావ్. నీమనో నిశ్చలతను గూర్చి మాజీవితకాలమంతా దుఃఖించమనిగదా యిటువంటి పన్చేశావ్.

ఉ. తీరకమున్నె మీఋణము దేహమునంబుధి జేర్చినావనీ
కోరికతీరెనాతుదకు కూపమునన్ మముద్రోయనీసుతుల్
బోరుమనేడ్చునే మొయని బుద్ధినిదల్పక నిట్లుచేసె నీ
చారితమింక నద్దెసల చాటుచు నేడ్వగజేసినావొకో.

తండ్రీ! నీతుదిసందేశమునైనను మాకుచెప్పకుండ కన్నము వేయువానివలె నిశరాత్రివేళ పారిపోయావా.

ఉ. ఒక్కటిగూడ తెల్యనిది యొజ్జనులేదిలగాని యయ్యో తా
రెక్కడురెక్కలేక కడు రేయిబవల్ శ్రమజెందుచుండునే

పక్కకిరైన చెట్టొకటి పావముయున్నది పంతులయ్యకో
ఎక్కడతావులేవకట యీగతినుండగ యీవుజపింతో.

ఉ. అప్పులుతీర్చలేక కడు యాధికబాధయుపోక నొజ్జలే
ఎప్పుడుబాధజెందుచునె యీసుమబాధతో కృంగిపోవునే
తప్పకచెప్పకుందురయొ దాతినిముందు యుగంబువారలే
దిప్పలుపెట్టె రొజ్జలను తిండికి యాప్రభుపంచు సోదరా.

ఉ. పాపము పస్తులేసతికి జారెనుగుడ్డను బెట్టలేక తా
లోభముకాక కాదు తన రోజులుసంచివిలేక కాదు వా
ర్యాపినచూపులే ప్రభులు చూడక కారణమంతె కాని వా
రోక పమదేమియో తెలియ గున్నానుగుస్తను లేకపోయెనే.

రోజల్లా వాగివాగి బుర్ర వేడెక్కిపోయి వోపికలేక కాళ్లుచేతు
లు గుడ్డపీలికల్లాగు వ్రేలాడుతుంటై. పాపం యీ పంతులెంత
కష్టపడుతున్నాడని ఆలోచించి కష్టానికితగిన డబ్బులుచేతికిస్తారా.
యివ్వరు. జీవితానంతరంవరకు అలా చావవాలసిందే యిబ్బంది
పడుతూను. ఎవరైనను లెక్కలలోనుంచురు. కాని ఈపాధ్యా
యులుమాత్రం లెక్కలలోవుండరు. వీరివుద్యోగ్యం గడ్డిపరకకంటె
తక్కువగా చూస్తారు.

ఉ. చింతతోనుండుజీవితము చిక్కులలోబడియుండు నెప్పుడున్
అంతునులేని యప్పులతో నాలియుపిల్లలు బాధజెందుచున్
నుంతయుదేహసౌఖ్యమును చూడకవాగుచునుండు వారలుౘ
ఇంతకు నొజ్జలేమియును ఏబదిఏండ్లకుమించి బ్రతుక్కరే.

దో:— పండితుడుకొడుకు ఏనాటికైన పండితుడే. జగన్నాథం చాలా
గొప్పగా చెప్పావయ్యా. నిజంగా ఉపాధ్యాయుల కష్టాలు కం

జ్ఞకుకట్టినట్లుగా బోధపర్చావు. నీవునిజంగా మంత్రిపదవిలో నుండవలసినవాడవే. ఎంతడబ్బుఖర్చుపెట్టియైనా నిన్ను ఎమ్. ఎల్. ఏ.కి తీసుకురావడానికి ప్రయత్నిస్తాను. తప్పకుండా ఆనాడు ఉపాధ్యాయ సంఘానికి గొప్పమేలు చేసితీర్తావ్.

జ:— మీబోటిపెద్దలు ఆశీర్వాదముంటె ఏకార్యమైనను సాధించగలం.

దొ:— జగన్నాథం అదెంతపని చేయుడం. ప్రభుత్వం మన్దేగా రైతులదే రాజ్యాం. నేనునీగురించి సర్వప్రయత్నం చేస్తా.

జ:— మంచిదండీ.

దొ:— నేడేనిన్ను కాంగ్రెసు సభ్యుణ్ణిచేస్తా.

జ:— నావొద్ద డబ్బులేదండీ.

దొ:— అదంతా నేనుచూచుకుంటానులే. నర్సయ్య కన్పించాడా.

జ:— మూడురోజులైంది కన్పించి. మళ్లాకన్పించలేదు,

దొ:— ఆతడుకూడా చాలా పట్టుదలైనవాడు. యీవిషయంలో అతడు కూడ పూనుకుంటాడు. పలుకుబడిగలవాడు కూడాను. నీవు తప్పకుండా మంత్రిగావచ్చితీర్తావ్. మమ్మల్ని మరువక.

జ:— మీపెద్దలనుగ్రహమున దేవుడాశీర్వాదమున తప్పకట్టిపదవిలోనే యుంటె తప్పక మీపేరుకీర్తులను నిలబెట్టితీర్తాను. నాప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాను. ప్రజాసేవచేస్తాను. కష్టజీవుల కడుపుమంటలు చల్లారుస్తా.

( నర్సయ్య ప్రవేశం )

జ:— నమస్తే. నర్సయ్యగారు.

న:— నమస్తే. యిక్కడున్నారే అంతా.

దొ:— తెలియలేదుకాబోలు పంతులుగారు నిన్న యిక్కడికేవొచ్చి గంగమ్మకు ఆహుతయ్యారు.

న:— హారి. హారి. జైలునుండి వొచ్చిందేది. సముద్రంలో పడిందేది. యీ చిన్నబిడ్డల నేమిచేసిపోయాడు.

దొ:— మనిద్దరికప్పగించిపోయాడు.

న:— నీకేమైన తెలిసిందా పోవడం.

దొ:— నేనుసంతకుపోతూ పంతులుగారినిచూశా పలకరించా. దొరయ్యా నని గుర్తుపట్టాడు. తనకష్టకాలమంతా వెళ్ళిపోయాడు.

న:— నీవుదగ్గరుండి ఎలాపడనిచ్చావయ్యా.

దొ:— ఎంతో బ్రతిమాలాను. తనయావజ్జీవితానంత పోషిస్తానన్నా తన పేరను ఎకరంభూమికూడా వ్రాస్తానన్నా. అటువంటి స్వార్థపరుణ్ణికాదన్నాడు. ఎన్నివిధాలో నచ్చచెప్పా. ఎంతకువినుపించుకోలేదు.

న:— నామాటైన జ్ఞాపకంరాలేదా.

దొ:— సర్వసత్యంతో నాబిడ్డల్ని వొకకంటితో కనిపెట్టమని చెప్పమన్నాడు

న.— దొరయ్యా నేను ఏవిషయంలోకూడ ద్రోహంచేయలేదు. మేలే చేశాను.

దొ:— నేనుకూడ అతనికి ఏవిధమైన ద్రోహంచేయలేదు. నీవెరుగుదువుగా.

న:— అవును. ఆయనవుపకారానికి మన ధన్యవాదాలు.

గో:— మనంతప్పక జగన్నాథాన్ని ఎమ్.ఎల్.ఏ.గా నిలబెట్టితీరాలి.

న:— తప్పకుండా నిలబెట్టాలి.

దొ:— రేపు మహాసభ యేర్పాటుచేయమంటావా.

న:— తప్పకుండా చేయమనే నాకోరిక.

( తె ర ప డు ను )

# ఎసెంబ్లీమీటింగు మంత్రులు

[జగన్నాధ, రాఘవయ్య, బ్రహ్మానందం, శ్రీమన్నారాయణ, శర్మ]

జ:- ఉపాధ్యాయులుపంపించుకొన్న మహజరుగురించి నేను మాట్లాడు తున్నాను. ప్రాధమిక పాఠశాలల పంతుళ్లకు ప్రభుత్వంయిచ్చే వేతనాలు కరువుబత్యాలు సరిపోవుటలేనిమాట వాస్తవమే. వాళ్లు కష్టపడే కష్టానికి తగినంత ఫలితం యివ్వుటలేదనుటలో సత్యం కూడవుంది. అయి తేబడిపంతుళ్లు పడేకష్టాన్నిగురించి కొంత యోచించాలి. బడిపంతులు నిజమైన దేశసేవకుడని ముఖ్యంగా చెప్పవలసియుంటింది. అమోఘమైనసేవ గ్రామానికిచేస్తున్నా డు. అయిదారేండ్ల పసిపాపవద్దనుండి పన్రెండు పదిహేను ఏండ్లబిడ్డలవరకు సకలవిద్యలునేర్పి ప్రభుత్వానికప్పగిస్తున్నాడు. యింతకు తానుబాల్యమందు ఏవిత్తనమైతే వేస్తున్నాడో ఆవిత్త నం ఫలించుటసహజం. తనచేజిక్కిన బాలునిగాని బాలికను గాని వొకమొద్దురాచిప్పగా తయారుచేయాలంటె బడిపంతులు చేతిలోనే వుంటుంది. బడిపంతులు కడుపునిండాకూడు వొంటి నిండాగుడ్డ తలదాచుకోడానికికొంప వుంటేనేగదా చంటిబిడ్డలకు విద్య సంపూర్ణంగా ఆశక్తితో నేర్పగలడుగాని ఆకలితో అలమ టిస్తూ భార్యా వొకవైపున బిడ్డలు వొకవైపున అన్నమన్న మని పీకుతింటుంటె ఏబడిపంతులు పనిచేయగలడు. అదిగూడ మనం దీర్ఘాలోచనచేయాలి. చదువుచెప్పినా చెప్పకపోయినా మన మొకందుకు జీతమిస్తే పంతులొకందు చదువుచెబున్నాడను

కుంటే దేశమంటే ఏమిఅర్థముండదు.

రా— జగన్నాథంగారి వుద్దేశాన్ని నేనుబలపరుస్తున్నా. తప్ప కుండా ఎలిమెంటరీస్కూళ్ల ఉపాధ్యాయులకు జీతాలు పెంచవ లసివుంటుందని నాఅభిప్రాయం.

ప్ర:- ప్రపంచంలో బడిపంతులకే బహుతక్కువజీతం. పంతుళ్లయొక్క కష్టాల్ని ఆలోచించి వారికే ఎక్కువగా జీతాలుపెంచాలి.

ప్ర:— ఉపాధ్యాయుల జీతాలుపెంచడంలో నేను సంపూర్ణంగా వ్యతిరే కుడను.

శ్ర:— ప్రసాద్‌గారు చెప్పినమాటలు చాలా వ్యతిరేకంగావున్నాయి. ఆయన వుద్దేశాన్ని కండిస్తున్నాను. మనమంతా యీవేళ యీఎసంబ్లీలో కూర్చొనేశక్తి ఎక్కడనుండివచ్చిందో గ్రహిం చకుండా మాట్లాడారు. ఆనాడు బాల్యదశలో ఎలిమెంటరీ చరు వేసిన పవిత్రమైనవిత్తనం యొక్కమహాప్రభావమే. బడిపంతులు దరిద్రంతో తాండవమాడును. ఆదరిద్రానికి కారణం ప్రభుత్వమే అంటాను. బడిపంతులకు అరువదిరూపా యలు ప్రారంభంలో వుంటేనేగాని వారిభార్యాబిడ్డలకు సరి పోదు. ఆనాడే నిజాయితీగా పనిచేస్తాడేమోఅనుకుంటాను. నలు బదిమంది పిల్లలకు సమాధానంచెబుతూ వారి బుర్రలలోనికి అజ్ఞానాన్ని జొసిపేసరికి ఎంతశ్రమ పడవలసియుండునో మనం గ్రహించాలి. ఉపాధ్యాయునికి పెన్షన్‌కూడయిచ్చి వారిజీవి తాల్ని బాగుపర్చాలి.

జః— ఉపాధ్యాయులకు జీతాలు హెచ్చించవలెననువారు ఎక్కువ మంత్రులు అభిప్రాయపడుతున్నారు. గనుక ఉపాధ్యా అర్జీని అంగీకరించడమైనది. సభ ముగిసింది.

( సంపూర్ణము )



శ్రీరామాప్రెస్, రాజమండ్రి.